# ఆంధ్ర ప్రజలు - సిరి సంపదలు



రచన

యస్. వి. నరసయ్య

కె. యస్. రెడ్డి



విశాలాంధ్ర ప్రచురణాలయం

విజయవాడ:

# విషయసూచిక







# ప టు ము ల ప ట్టి క





# పరిచయం

నలుబది సంవత్సరాల ఆంధ్ర ప్రజల పోరాట ఫలితంగా అక్టోబరు ఒకటవ తేదీన ఆంధ్రరాష్ట్రం అవతరించబోతున్నది. అవతరించబోయే ఈ రాష్ట్రం ఎట్టిది? సహజ సంపదల పరిమాణ మెంత? వ్యవసాయం, పరిశ్రమలు మున్నగునవి ఏ స్థితిలో ఉన్నాయి? ప్రజల జీవిత స్థితిగతులెలా ఉన్నాయి, మున్నగు విషయాలను వివరిస్తూ, ఆంధ్రరాష్ట్ర సమగ్ర స్వరూపాన్ని — స్థూలంగానైనా చిత్రించగలిగిన పుస్తకం మనకు లేదు. ఈ లోటును తీర్చుటకు మేము చేసిన ప్రయత్న ఫలితమే ఈ పుస్తకం. ఇందులో ఎంతవరకు కృతకృత్యులమైనది నిర్ణయించవలసినది పాఠకులే!

ఈ పుస్తక రచనకు కావలసిన సంఖ్యా వివరాల నన్నింటినీ ప్రభుత్వ ప్రచురణలనుండే తీసుకున్నాం. ఉమ్మడి రాష్ట్రంలో మనకు జరిగిన అన్యాయాల్ని కప్పిపుచ్చే ఉద్దేశ్యంతో మదరాసు ప్రభుత్వం, ఆంధ్రకు సంబంధించిన అనేక విషయాలను బుద్ధిపూర్వకంగా దాచి ఉంచింది. ప్రచురించబడిన కొన్ని విషయాలయినా కలగాపులగంగా ఉన్నాయి. అధికార పూర్వకమైన అంచనాలు మరెచ్చటా లభించే అవకాశం లేదు. కనుక, కష్టమైనా, సాధ్యమైనన్ని వివరాలను, ప్రభుత్వ లెక్కలనుండే ఏరి కూర్చాం.

దొరికిన విషయమైనా కొన్ని కొన్ని సందర్భాలలో సమగ్రంగా లేదు. ఉదాహరణకు వివిధ పట్టాలక్రింద ఉన్న భూమిలో, ఎంత మెట్ట, ఎంత మాగాణీ ఉన్నది అనే వివరాలు ఎచ్చటా ఇవ్వబడలేదు. దీనికితోడు రెండు డిపార్టుమెంటులు ప్రకటించిన ఒకే విషయానికి సంబంధించిన సంఖ్యా వివరాలకు కొన్నిచోట్ల సాపత్యం కనుపించటం లేదు.

కొన్ని సందర్భాలలో ప్రభుత్వ సంఖ్యా వివరాలు అసలు విషయాన్ని తారుమారుచేసి చూపించే అవకాశంకూడా ఉన్నది. ఉదాహరణకు రాయలసీమ జిల్లాల్లో సుమారు తొమ్మిది లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యమున్నట్లు చూపబడింది. ఇన్ని లక్షల ఎకరాల మాగాణి ఉన్న రాయలసీమలో కరువు వస్తున్నట్లు చెప్పబడుతున్నదంటే, వాస్తవంగా నమ్మరాని విషయం. ఈ మాగాణి భూమిలో సుమారు ఎనిమిది లక్షల ఎకరాలు నీటి పారుదలకు, వర్షం కురిస్తేనేగాని నిండని బావులు, చెరువులపై ఆధారపడవలసి ఉన్నది. వర్షాభావం చాల సామాన్యమైన యీ ప్రాంతాల్లో, ఇన్ని లక్షల ఎకరాలకూ ప్రతి సంవత్సరం నీటి పారుదల సౌకర్యం ఉండదు. కాని, ఒకచోట వర్షాభావాన్ని ఒప్పుకునే ప్రభుత్వ అంచనాలు, వేరొకచోట ఇన్ని లక్షల ఎకరాలలో నీటి పారుదలతో పంటలు పండించబడినట్లు చిత్రిస్తాయి. ప్రజలు కరువులో ఒక ప్రక్క అల్లాడుతూ ఉన్నా, రాయలసీమప్రాంతం ఆహార ధాన్యాల విషయంలో మిగులు ప్రాంతంగా చిత్రించుటకుకూడా అవకాశం ఇస్తున్నాయి.

కనుక పాఠకులు, ఆయా ప్రాంతాల వాస్తవిక స్థితిగతులతో యీ సంఖ్యా వివరాలను జోడించి చూడాలికాని, ప్రభుత్వ సంఖ్యా వివరాల దృష్టితో మాత్రమే, కొన్ని విషయాలలో, ఆయా ప్రాంతాల చిత్రాన్ని ఊహించరాదు.

ప్రభుత్వ సంఖ్యా వివరాలలో ఇట్టి బలహీనతలు కొన్ని ఉన్నా, ఆంధ్ర ప్రజల సిరి సంపదల నర్థం చేసుకునేందుకు అవి నిస్సందేహంగా తోడ్పడతాయి. కనుకనే వీటిని స్వీకరించాం.

అన్ని విషయాలలోనూ బళ్ళారి జిల్లాలోని మూడు తెలుగు తాలూకాలకు సంబంధించిన వివరాలు లభించకపోవటంచేత, మొత్తం జిల్లా వివరాలనే ఇచ్చాం.

త్వరగా తీసుకురావాలనే ప్రయత్నంలో కొన్ని అచ్చు తప్పులు దొర్లాయి. పాఠకులు మన్నిస్తారని ఆశిస్తాం.

పాఠకులు తమ అభిప్రాయాలు పంపి తప్పులు ఏవయినా ఉంటే, ద్వితీయ ముద్రణలో సవరించుకొన తోడ్పడ ప్రార్థన.

వ్రాత ప్రతిని ఓపికతో చదివి, అమూల్య సలహాల నిచ్చిన మిత్రులకు ఆంధ్ర రాష్ట్రి అవతరణనాటికి పుస్తకాన్ని వెలువరచ సాయపడిన మిత్రులందరికీ అభి వందనాలు.

23/251, మాచవరం,
విజయవాడ,
26—9—1953.

ఇట్లు,

రచయితలు

# ఆంధ్రప్రజలు - సిరిసంపదలు

---

## ఆంధ్రరాష్ట్రం

సర్వాంధ్రరాష్ట్రం పదకొండు జిల్లాల మూడు తాలూకాలు (శ్రీకాకుళం, విశాఖ, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు జిల్లాలు, బళ్లారి జిల్లాలోని ఆదోని, రాయదుర్గం, ఆలూరు తాలూకాలు) నిర్వివాద ప్రాంతంగా ఏర్పడుతుంది. ఈ భూభాగం 77°—85° అక్షాంశ రేఖల మధ్యను, 19¾°—12½° తులాంశ రేఖల మధ్యను ఉన్నది. ఈ ప్రాంత జనాభా 1,98,35,000. దీని వైశాలం 61,929 చదరపు మైళ్లు; లేక 3,96,34,403 ఎకరాలు. ఈ భూభాగం మొత్తం భారతదేశ వైశాల్యంలో సుమారు 25 వ వంతు. మొత్తం మదరాసు రాజధాని వైశాల్యంలో సగంకంటె కొంచెము తక్కువ. భారతదేశ జనాభాలో సుమారు 18వ వంతు, మొత్తం మదరాసు రాజధాని జనాభాలో 3 వ వంతు ఉంటుంది. చదరపు మైలుకు సగటున 320.3 మంది నివసిస్తున్నారు. జిల్లావారీ వైశాల్యం, జనాభా వివరాలు ప్రక్కపేజీలోని పట్టికలో పొందుపరచబడినవి.

ఈ రాష్ట్రానికి సరిహద్దులుగా, దక్షిణమున పరిశిష్ట మదరాసు రాష్ట్రము ( Residuary Madras State ) ఉత్తరమున హైదరాబాదు సంస్థానం, మధ్య ప్రదేశ్, ఒరిస్సారాష్ట్రాలు; తూర్పున బంగాళాఖాతం, పశ్చిమాన మైసూరు సంస్థానం ఉన్నవి.

### భూ వి భ జ న

1947–48 ప్రభుత్వ లెక్కల ప్రకారం, 3,96,34,000 ఎకరాల ఆంధ్ర భూభాగంలో 72,49,000 ఎకరాలు అడవులక్రింద, 75,31,000 ఎకరాలు సాగుకు లాయకుగాని బంజరుకింద, 61,08,000 ఎకరాలు సాగుకు లాయకైన బంజరుగాను, 41,77,000 ఎకరాలు పడావాభూమి (fallow-land) క్రింద, 1,45,69,000 ఎకరాలు సాగుక్రింద నున్నది.

# ఆంధ్రదేశ జనసంఖ్యా వివరాలు (1951)

| జిల్లా పేరు | విస్తీర్ణం చ॥ మైళ్ళలో | పురుషులు | స్త్రీలు | మొత్తం జనాభా | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా |
|---|---|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళం ... | 3,888.96 | 10,34,910 | 10,80,226 | 21,23,136 | 19,32,351 | 1,90,785 |
| 2. విశాఖపట్నం ... | 5,178.78 | 10,23,192 | 10,49,506 | 20,72,689 | 17,67,840 | 2,04,858 |
| 3. తూర్పు గోదావరి ... | 5,682.13 | 12,06,483 | 12,08,325 | 24,14,808 | 19,54,662 | 4,60,146 |
| 4. పశ్చిమ గోదావరి ... | 3,014.77 | 8,48,990 | 8,48,737 | 16,97,727 | 13,66,458 | 3,31,269 |
| 5. కృష్ణా ... | 3,498.73 | 9,03,872 | 8,75,612 | 17,79,484 | 14,09,392 | 3,70,092 |
| 6. గుంటూరు ... | 5,771.45 | 12,91,745 | 12,58,251 | 25,49,996 | 20,48,075 | 5,01,921 |
| 7. కర్నూలు ... | 7,836.29 | 6,43,594 | 6,27,249 | 12,70,843 | 10,70,625 | 2,00,218 |
| 8. అనంతపురం ... | 6,706.45 | 7,01,242 | 6,60,314 | 13,61,556 | 11,39,998 | 2,21,558 |
| 9. కడప ... | 5,928.95 | 5,95,060 | 5,66,671 | 11,61,731 | 10,27,502 | 1,34,229 |
| 10. నెల్లూరు ... | 7,959.67 | 9,02,729 | 8,92,838 | 17,95,632 | 15,91,993 | 2,03,639 |
| 11. చిత్తూరు ... | 5,889.52 | 9,24,592 | 8,85,785 | 18,10,227 | 16,41,043 | 1,69,334 |
| 12. * బళ్లారి ... | 5,881.78 | 6,32,285 | 6,11,240 | 12,43,525 | 9,74,172 | 2,69,353 |
| | 67,237.48 | 1,07,08,694 | 1,01,64,754 | 2,12,81,354 | 1,79,24,111 | 32,57,402 |

* బళ్ళారి జిల్లాలోని అన్ని తాలూకాలు.

—Source : 1951 జనాభా లెక్కలు. I పేపరునుండి.

# ఆంధ్రరాష్ట్రం

## జనాభా - విస్తీర్ణం

బళ్ళారిజిల్లా మొత్తం వివరాలు యివ్వబడ్డాయి

ఉ

ప తూ

ద



ఆంధ్రరాష్ట్రంలో సగటున తల ఒక్కంటికి 0.73 ఎకరాలు సాగుచేయబడుతున్నది. తల ఒక్కంటికి సగటున బొంబాయిలో 1.32 ఎకరాలు, ఒరిస్సాలో 0.74 ఎకరాలు, మదరాసులో 0.65 ఎకరాలు సాగుచేయబడుతున్నది.

మొత్తం ఆంధ్రదేశ వైశాల్యంలో 36.76% భూమి సాగుకింద ఉన్నది. 15.41% సాగుకు లాయక్కైన బంజరుక్రింద ఉన్నది. సాగుకు లాయక్కైన మొత్తం భూమిలో 75% ఇప్పటికే సాగుకిందగాని, పడావుగాగాని (Current Fallows) ఉన్నది. సాగుకు లాయక్కైన బంజరు నంతటిని సాగులో పెట్టినప్పుడు, సాగుకింద ఉండే భూమి తల ఒక్కటికి 0.2 ఎకరాలు పెరుగుతుంది. అపుడు ఆంధ్రదేశంలో సాగుకింద ఉండేభూమి తల ఒక్కంటికి 0.93 ఎకరాలకు పెరుగుతుంది.

---

Note:— ఈ అధ్యాయంలో ఇవ్వబడిన అంచనాలన్నీ, మద్రాసుప్రభుత్వ ఆర్థికశాఖా సలహాదారు శ్రీవట రాజన్ వ్రాసిన (Economic wealth of Andhra) అన్న వ్యాసంనుండి స్వీకరించబడినవి. అధ్యాయం చివరలో ఇవ్వబడిన జిల్లావారీ వివరాలు, 1950–51 Season and Crop Report of Madras State నుండి తీసికొనబడినవి. బళ్ళారిజిల్లా ఆంధ్రప్రాంతానికి ప్రత్యేక అంకెల వివరాలు ఎచ్చటా లభ్యము కాకపోవుటచేత, మొత్తంజిల్లాను ఆంధ్రరాష్ట్రంలో చేర్చి లెక్కవేయడం జరిగింది. అందుచేత అధ్యాయం చివరనున్న పట్టికలోని అంచనాలకు, అధ్యాయంలోని అంచనాలకు కొద్ది తేడా కన్పిస్తుంది.

# జిల్లావారీ భూ విభజనా వివరాలు

| * జిల్లా పేరు (1) | మొత్తం విస్తీర్ణం (2) | ఆడవులు. (3) | మొత్తం విస్తీర్ణంలో ఎన్నోవంతు? (%) (4) | సాగుకు లాయకు గాని ప్రరభూమి (5) | మొత్తం విస్తీర్ణంలో ఎన్నోవంతు? (6) | సాగుకు లాయకైన బంజరు (7) | మొత్తం విస్తీర్ణంలో ఎన్నోవంతు (%) (8) |
|---|---|---|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళం ... | 24,88,931 | 5,55,243 | 22.3 | ... | ... | 2,50,322 | 10.1 |
| 2. విశాఖ ... | 33,14,434 | 15,29,978 | 46.2 | 3,73,222 | 11.3 | 92,896 | 2.8 |
| 3. తూర్పు గోదావరి ... | 36,36,573 | 8,64,855 | 23.8 | 7,54,544 | 20.8 | 4,04,463 | 11.1 |
| 4. పశ్చిమ గోదావరి ... | 19,29,460 | 1,16,485 | 6.0 | 1,80,501 | 9.4 | 20,19,74 | 10.5 |
| 5. కృష్ణా ... | 22,39,187 | 1,25,550 | 5.6 | 3,07,150 | 13.8 | 2,50,947 | 11.3 |
| 6. గుంటూరు ... | 36,93,743 | 4,68,862 | 12.7 | 3,75,095 | 10.2 | 22,652 | 2.5 |
| 7. కర్నూలు ... | 50,15,222 | 16,60,142 | 30.2 | 2,95,877 | 5.9 | 6,00,475 | 12.0 |
| 8. అనంతపూరు ... | 42,92,129 | 4,52,794 | 10.6 | 3,62,477 | 8 5 | 4,02,030 | 9.4 |
| 9. కడప ... | 37,94,524 | 11,56,865 | 30.5 | 1,69,628 | 4.5 | 6,48,240 | 16.9 |
| 10. నెల్లూరు ... | 50,94,191 | 4,73,222 | 9.3 | 17,50,640 | 34.4 | 11,267 | 0.2 |
| 11. చిత్తూరు ... | 37,69,290 | 5,23,743 | 13.9 | 9,34,700 | 24.8 | 4,34,689 | 11.5 |
| 12. బళ్ళారి (మొత్తం) ... | 37,64,342 | 3,65,077 | 9.7 | 2,03,807 | 5.4 | 1,75,201 | 4.7 |
| | 4,30,32,026 | 82,92,816 | | 57,07,641 | | 35,60,156 | |

* విస్తీర్ణం ఎకరాలలో

| | జిల్లా | శాశ్వత పచ్చిక భూములు (9) | మొత్తం విస్తీర్ణం లోఎంత % (10) | తోటలు, చెట్లు తోపులు ఇత్యాది వాటిక్రింద ఉన్న భూమి (11) | మొత్తం విస్తీర్ణం లోఎంత % (12) | పడావులు (Current fallows) (13) | మొత్తం విస్తీర్ణం లోఎంత % (14) | ఇతర పడావులు (Other fallow lands) (15) | మొత్తం విస్తీర్ణం లోఎంత % (16) | ఒకసారి మొత్తం పంట పండించే భూమి (17) | మొత్తం విస్తీర్ణంలో ఎంత (18) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 3,362 | 0.1 | 8,157 | 0.3 | 1,62,514 | 6.5 | ... ... | .. | 8,28,311 | 33.3 |
| 2. | విశాఖ | 37,559 | 1.1 | 41,415 | 1.2 | 1,05,656 | 3.2 | 46,125 | 1.4 | 8,27,903 | 25.0 |
| 3. | తూర్పుగోదావరి | 1,38,726 | 3.8 | 52,565 | 1.4 | 52,762 | 1.5 | 1,24,254 | 3.4 | 10,49,014 | 28.8 |
| 4. | పశ్చిమ గోదావరి | 65,452 | 3.4 | 20,519 | 1.1 | 2,50,932 | 13.0 | 84,271 | 4.4 | 8,91,947 | 46.3 |
| 5. | కృష్ణా | 26,850 | 1.2 | 32,516 | 1.4 | 2,08,022 | 9.3 | 12,460 | 0.6 | 12,48,591 | 56.0 |
| 6. | గుంటూరు | 94,737 | 2.6 | 92,470 | 2.5 | 3,44,698 | 9.3 | 63,855 | 1.7 | 21,21,910 | 57.5 |
| 7. | కర్నూలు | ... | ... | 191 | ... | 2,69,092 | 5.4 | ... .. | ... | 21,26,643 | 42.5 |
| 8. | అనంతపూరు | 40,304 | 0.9 | 1,10,668 | 2.6 | 2,48,689 | 5.8 | 2,45,813 | 5.7 | 22,25,?97 | 51.9 |
| 9. | కడప | 1,49,368 | 3.9 | 28,851 | 0.8 | 2,77,420 | 7.3 | 26,861 | 0.7 | 10,56,282 | 27.8 |
| 10. | నెల్లూరు | 9,614 | 0.2 | 36,455 | 0.7 | 26,754 | 0.5 | 12,91,614 | 25.4 | 12,85,702 | 25.3 |
| 11. | చిత్తూరు | 45,536 | 1.2 | 57,885 | 1.5 | 4,28,855 | 11.4 | 1,68,692 | 4.5 | 8,24,356 | 21.9 |
| 12. | బళ్ళారి | 42,216 | 1.1 | 16,720 | 0.4 | 1,83,654 | 4.9 | 92,274 | 2.5 | 24,59,004 | 65.3 |
| | | 6,53,724 | | 4,98,412 | | 25,59,048 | | 21,56,219 | | 1,69,45,260 | |

| | జిల్లా పేరు | | ఒక్కసారికిమించి పైరువేసే విస్తీర్ణం (19) | మొత్తం విస్తీర్ణంలో ఎంత (%) (20) | మొత్తం పంట పండించే విస్తీర్ణం (Gross cultivated area) (21) | మొత్తం విస్తీర్ణంలో ఎంత (%) (22) |
|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | ... | 2,28,104 | 9.1 | 10,56,415 | 42.4 |
| 2. | విశాఖ | ... | 2,72,734 | 8.2 | 11,00,637 | 33.2 |
| 3. | తూర్పు గోదావరి | ... | 2,83,085 | 7.8 | 13,32,099 | 36.6 |
| 4. | పశ్చిమ గోదావరి | ... | 2,34,886 | 12.2 | 11,26,803 | 58.5 |
| 5. | కృష్ణా | ... | 1,56,124 | 7.0 | 14,04,715 | 63.0 |
| 6. | గుంటూరు | ... | 2,73,350 | 7.3 | 23,95,260 | 64 8 |
| 7. | కర్నూలు | ... | 52,395 | 1.1 | 21,79,038 | 43.6 |
| 8. | అనంతపూరు | ... | 69,142 | 1.6 | 22,94,739 | 53.5 |
| 9. | కడప | ... | 73,367 | 1.9 | 11,29,649 | 29.7 |
| 10. | నెల్లూరు | ... | 1,13,828 | 2.2 | 13,99,530 | 27.5 |
| 11. | చిత్తూరు | ... | 52,442 | 1.4 | 8,76,798 | 23.3 |
| 12. | * బళ్లారి | ... | 1,29,548 | 3.5 | 25,88,552 | 68.8 |
| | | | 19,39,005 | | 1,88,84,235 | |

* బళ్ళారి జిల్లాలోని అన్ని తాలూకాలు చేర్చబడినవి.

—Source : Season and crop Report of Madras State – 1950–'51.

# నైసర్గిక స్వరూపం

ఆంధ్ర రాష్ట్రంలో చెప్పుకోతగ్గ పర్వతాలుకాని, శిఖరాలుకాని లేవు. ఉన్న కొండలల్లా ఒరిస్సానుండి దక్షిణానికి ప్రాకిఉన్న తూర్పు కనుమలు మాత్రమే! ఈ తూర్పు కనుమలయొక్క సగటు ఎత్తు 3,000 అడుగులు. ఇవి దక్షిణానికి పోయిన కొలదీ తగ్గిపోతున్నాయి. ఇవికాక అక్కడక్కడ చిన్న చిన్న మిట్టలు, గుట్టలు కృష్ణా, గుంటూరు, కడప, కర్నూలు, అనంతపూరు జిల్లాల్లో కలవు.

ఉత్తర జిల్లాలయిన శ్రీకాకుళం, విశాఖ, గోదావరి జిల్లాల పశ్చిమ భాగంలో తూర్పు కనుమల శాఖ ఒకటి నడుస్తున్నది. దీని ప్రభావంగా ఈ ప్రాంతంలో శీతోష్ణ పరిస్థితులు మిగతా ప్రాంతాలతో భేదిస్తున్నవి.

ఈ కనుమలు ఋతుపవనాల నడ్డి, అధిక వర్షానికి కారణమగుటచేత, దట్టమయిన అడవులు పెరిగినవి. వీటినే ఏజన్సీ అడవులని, లేక "మన్యం" అని పిలుస్తారు.

దక్షిణ జిల్లాలలో బంగాళాఖాతానికి, తూర్పు కనుమలకు మధ్యగా మిట్ట భూములు ( elevated tracts ) కలవు.

ఆంధ్ర దేశంగుండా ప్రవహించే ముఖ్య నదులు – గోదావరి, కృష్ణా, తుంగభద్ర, పెన్న. వీటికి అనేక ఉపనదులు కలవు.

## గోదావరి

గోదావరి నది పశ్చిమ కనుమలలో పుట్టి, 900 మైళ్లు తూర్పుగా ప్రవహించి, బంగాళాఖాతంలో బడుతున్నది. దీని అధికతమ ప్రవాహ పరిమితి 15 లక్షల క్యూసెక్‌లు. బొంబాయి, మధ్యప్రదేశ్, నిజాం సంస్థానంగుండా ప్రవహించి, పోలవరం ప్రాంతంలో నది విస్తృత రూపాన్ని తీసుకున్నది. తూర్పు గోదావరి జిల్లాలోని ధవళేశ్వరంవద్ద పెద్ద ఆనకట్ట కట్టబడినది. ఇచ్చట నది రెండు శాఖలుగా చీలినది. వీటిలో తూర్పుశాఖను గౌతమీ గోదావరి అందురు. ఇది యానాంవద్ద సముద్రములో కలియును. పశ్చిమశాఖను వశిష్ట గోదావరి అందురు. ఇది నర్సాపూరు వద్ద సముద్రములో కలియుచున్నది.

### కృష్ణా నది

కృష్ణానది పశ్చిమ కనుమలలోని మహాబలేశ్వరం సమీపంలోపుట్టి, బొంబాయి, హైదరాబాదులగుండా తూర్పుగా ప్రవహించి, కృష్ణాజిల్లాలోని హంసల దీవివద్ద బంగాళాఖాతములో కలియుచున్నది. ఆంధ్ర, హైద్రాబాదులకు సరిహద్దుగా గుంటూరు, కర్నూలు జిల్లాలలో ప్రవహించుచున్నది. కర్నూలు జిల్లాలో తుంగభద్రా నది దీనిలో కలియుచున్నది. విజయవాడవద్ద దీనికి పెద్ద ఆనకట్ట నిర్మించబడింది. ఆన కట్టదాటి, నది 40 మైళ్ళు ప్రవహించిన తర్వాత, "పులిగడ్డపాయ" చీలింది. పులిగడ్డ పాయకు, నదికి మధ్యనున్న ప్రదేశాన్ని "దివిసీమ" అందురు. నది, తరువాత 15 మైళ్ళు ప్రవహించి, మూడుపాయలుగా చీలి బంగాళాఖాతంలో కలియుచున్నది. దీని ప్రవాహ పరిమాణం పదిలక్షల క్యూసెక్కులని అంచనా వేయబడినది.

### తుంగభద్ర

పశ్చిమ కనుమలలో పుట్టిన "తుంగ", "భద్ర"ల సంయోగం ఫలితమే తుంగభద్రానది. "తుంగ" "భద్ర"లు మైసూరు సంస్థానంలోని "కుడాలి" (షిమొగాకు ఎనిమిదిమైళ్ళ దూరంలో) అన్నచోట కలియుచున్నవి. బళ్ళారిజిల్లాలోని ఆదోని తాలూకా సరిహద్దు, కర్నూలుగుండా, నిజాం–ఆంధ్రదేశ సరిహద్దుగుండా తూర్పుగా ప్రవహించి, కర్నూలు జిల్లాలో కృష్ణలో కలియుచున్నది. బళ్ళారి జిల్లాలోని మలప్పురం వద్ద దీనిపై ఆనకట్ట నిర్మించబడింది.

### వర్షపాతం - శీతోష్ణస్థితి

రాష్ట్రవాతావరణ పరిస్థితిని స్థూలంగా క్రిందివిధంగా విభజించవచ్చును.

(1) జనవరి – మార్చి ... పొడిగాలి.
(2) ఏప్రిల్ – మే ... వేడిగాడ్పులు.
(3) జూన్ – సెప్టెంబరు ... నైరుతి ఋతుపవనాలు.
(4) అక్టోబరు – డిశంబరు .. ఈశాన్య ఋతుపవనాలు.

ఆంధ్రదేశ వ్యవసాయానికి నైరుతి ఋతుపవనాలవల్ల కల్గే వర్షాలే ముఖ్యాధారం. కృష్ణా – గోదావరి డెల్టాలకు నీటి సప్లయి పుష్కలంగా జరగటంకూడా వీటిపైనే ఆధారపడి ఉన్నది. కృష్ణా – గోదావరీ నదులకు వచ్చే వరదలకుకూడా ఈ పవనాలే ఆధారం.

జూన్ మాసంతో నైరుతి ఋతుపవనాలవల్ల కలిగే వర్షాలు ప్రారంభమవుతాయి. జూన్, జూలై నెలలలో, మొత్తంమీద కొద్దిపాటి వర్షమే కురుస్తుంది. ఆగస్టు, సెప్టెంబరులలో ఈ పవనముల మూలంగా వర్షం అధికంగా కురుస్తుంది.

సెప్టెంబరు నెలాఖరునుండి, పశ్చిమ పవనములు నీరసించిపోతాయి. కొద్ది కాలం తర్వాత ఈశాన్య ఋతుపవనాలు ప్రారంభమగును. ఈ పవనములవల్ల మనకు నవంబరు, డిశంబరు నెలలలో వర్షము కురియును.

శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి జిల్లాలు, కృష్ణా డెల్టా ప్రాంతాల్లో సంవత్సరంలో సగటున సుమారు *36 అం॥ – 38 అం॥ వర్షం పడుతుంది. ఇందులో సగ భాగానికి పైగా ఈశాన్య ఋతుపవనాలవల్లనే కురియుచున్నది. మరింత దక్షిణంగా ఉన్న గుంటూరు, నెల్లూరు జిల్లాల సముద్రతీరం, కడప జిల్లాలోని రాజంపేట తాలూకాలో సంవత్సర సగటు వర్షపాతం 31 అం॥ — 39 అం॥లు. ఈ ప్రాంతానికి దక్షిణంగా ఉన్న చిత్తూరు జిల్లా ప్రాంతంలో సంవత్సర సగటు వర్షం 30 అం॥ — 49 అం॥లు.

బళ్లారి, అనంతపూరు, కర్నూలు జిల్లాలలో, పైన పేర్కొనబడిన భూభాగానికి ఉత్తర దిశన ఉన్న ప్రాంతాలలో, మన రాష్ట్రంలోకల్లా తక్కువ వర్షం పడుతుంది. ఇచ్చట సంవత్సర సగటు వర్షపాతం 20 అం॥ మాత్రమే! ఈ ప్రాంతాన్ని

పవనాలవారీగా జిల్లాల్లోపడే వర్షపాతం వివరాలు క్రిందిపట్టికలో యివ్వబడినవి:

**1950-'51 లో వర్షపాతం (అం॥లో)**

| జిల్లా | నైరుతి ఋతు పవనాలు జూన్–సెప్టెంబరు | ఈశాన్య ఋతుపవనాలు సెప్టెంబరు–జనవరి | వేడిగాడ్పులు ఫిబ్రవరి–జూన్ | మొత్తం వర్షపాతం | వర్షం కురిసిన రోజులు |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం మైదానాలు | 21.9 | 9.4 | 7.4 | 38.7 | 54.5 |
| విశాఖపట్నం మైదానాలు | 16.7 | 11.5 | 6.9 | 35.1 | 50.6 |
| తూర్పుగోదావరి : | | | | | |
| ఏజన్సీ ప్రాంతం | 32.9 | 7.3 | 8.3 | 48.5 | 53.6 |
| మైదానాలు | 31.6 | 13.1 | 6.1 | 50.8 | 57.5 |
| పశ్చిమ గోదావరి | 33.0 | 7.3 | 6.6 | 46.9 | 54.6 |
| కృష్ణా | 23.1 | 4.4 | 6.7 | 34.2 | 43.7 |
| గుంటూరు | 16.4 | 6.5 | 4.1 | 27.0 | 45.0 |
| కర్నూలు | 10.8 | 4.8 | 7.1 | 22.7 | 40.8 |
| అనంతపూరు | 8.2 | 6.8 | 6.7 | 21.7 | 34.6 |
| కడప | 10.0 | 4.8 | 4.9 | 19.7 | 35.9 |
| నెల్లూరు | 12.0 | 16.7 | 3.8 | 32.5 | 48.6 |
| చిత్తూరు | 13.3 | 7.9 | 8.0 | 29.2 | 47.3 |
| బళ్ళారి | 10.0 | 8.7 | 5.6 | 24.3 | 34.7 |

**Source : Season and Crop Report of Madras State 1950–'51.**

* అంగుళం = 2 దుక్కులు.

అనుకొని ఉన్న ఆదోని, పత్తికొండ, పులివెందుల, జమ్మలమడుగు, కోయిలకుంట్ల తాలూకాలలో సంవత్సరానికి సగటున 21 అం॥లు—26 అం॥లు వర్షం పడుతున్నది. ఈ ప్రాంతంలో సంవత్సరం పొడుగునా పడేవర్షంలో, 5 అం॥లు – 7 అం॥ వాయువ్య ఋతుపవనాల మూలముగానే పడుతున్నది. వర్షపాతం ఇంత తక్కువ కనుకనే, ఈ ప్రాంతంలో ఒక్క సంవత్సరం పంటలు సరిగా పండితే, తర్వాత రెండు లేక మూడు సంవత్సరాలు ఎండిపోవడం సామాన్యమైనది.

---

# ఆంధ్రరాష్ట్రం

## వర్షపాతం




ఒరిస్సా
శ్రీకాకుళం
మధ్యప్రదేశ్
హైద్రాబాద్
తూ.గోదావరి
ప.గోదావరి
బళ్లారి
కర్నూలు
బంగాళాఖాతం
కడప
అనంతపూర్
మైసూరు
మద్రాసు

సూచిక

0—30 అంగుళములు

31—40 ,,

41—70 ,,

# ప్రజలు - వారి వృత్తులు

ఆర్థిక పరిస్థితులదృష్ట్యా, ఆంధ్రదేశ జనాభాను, డెల్టా ప్రాంత వాసులు, మెట్ట ప్రాంత వాసులు, అని స్థూలంగా రెండు భాగములుగా విభజించవచ్చును. కృష్ణ, గోదావరి, పెన్నా డెల్టా భాగంలోని ప్రజల స్థితిగతులు, కొద్ది వ్యత్యాసాలున్నా మొత్తంపై ఒకే రకంగా ఉంటాయి. రెండవ తరగతివారు మెట్ట ప్రాంత వాసులు – ప్రధానంగా రాయలసీమ జిల్లా వాసులు. వీరు నిత్యం కరువు కాటకాలతోను, అనారోగ్యంతోనూ బాధ పడుతున్నారు. దీని ఫలితంగా, ఈ ప్రాంత జనాభా కూడా అతి నీరసంగా పెరుగుతున్నది.

గత యాభై సంవత్సరాలలో, ఈ రెండు ప్రాంతాల జనాభా పెరుగుదల పరిమాణంలో ఎంత వ్యత్యాసం ఉన్నదో క్రింది పట్టిక స్పష్టం చేస్తుంది.

| జనాభా లెక్కల సంవత్సరం | కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతం<br>ఉభయ గోదావరి, కృష్ణా గుంటూరు జిల్లాలు | రాయలసీమ ప్రాంతం<br>కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం |
|---|---|---|
| 1891 | 40,20,262 | 34,44,163 |
| 1901 | 45,20,892 | 36,33,121 |
| 1911 | 51,41,043 | 37,61,856 |
| 1921 | 54,13,751 | 36,21,106 |
| 1931 | 61,92,977 | 39,94,543 |
| 1941 | 69,91,959 | 44,25,411 |
| **1891–1941** సంవత్సరాల మధ్య కాలంలో జనాభా పెరుగుదల శాతం | 73 | 28 |

**Source : Monograph of Rural Problems in Madras, Pages 10–11.**

కృష్ణా – గోదావరి డెల్టా ప్రాంతం కూడా ఆనకట్టల నిర్మాణానికి పూర్వం కరువు ప్రాంతమే. 1861-62 జనాభా లెక్కల ప్రకారం, ఈ ప్రాంత జనాభా కూడా 25,61,252 మాత్రమే! కాని కృష్ణ, గోదావరి ఆనకట్టలు కట్టిన తర్వాత, 1901 సంవత్సరానికే – 40 సంవత్సరాలలోనే 45,20,892 కు – దాదాపు రెట్టింపు – పెరిగింది. 80 సంవత్సరాలలో ( 1861 – 1941 ) జనాభా నూటికి 274 పాళ్ళు; 2¾ రెట్లు పెరిగింది. ( Monograph of Rural Problems in Madras - 12 పేజీ.)

రాయలసీమ జిల్లాలలో కడప – కర్నూలు కాలువ మినహా, మరే గ్యారంటీ నీటి పారుదల వసతులు లేకపోవటంవల్ల, ఈ జిల్లాలలోని ప్రజానీకం ఇతరుల కంటే ఆర్థికంగా వెనుకబడి ఉన్నారు. 1945 వ సంవత్సరంలో, ప్రాంతాలవారీ ఆదాయాలను గూర్చి, డా॥ బి. వి. నారాయణస్వామి సేకరించిన ఈ క్రింది వివరాలు ఈ విషయాన్ని ఋజువు చేస్తాయి.

## 1945 సం॥లో వ్యావసాయిక ఆదాయం (రూపాయలలో)

| ప్రాంతం* | సగటున కుటుంబానికి | సగటున తల 1కి |
|---|---|---|
| (1) కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరిజిల్లా మెట్టప్రాంతాలు | 1064.4 | 168.5 |
| (2) కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతాలు | 1010.5 | 161.8 |
| (3) ఉభయ విశాఖలు | 754.8 | 112.1 |
| (4) రాయలసీమ ప్రాంతం (నెల్లూరు మెట్టప్రాంతంతో) | 623.5 | 107.0 |

Source : Report of the Economist for Enquiry into rural Indebtedness. 44 Page.

*ప్రాంతాల విభజనకు నారాయణస్వామి వ్రాసిన పేర్లు నంబర్లవారీగా :

(1) సర్కారుల మెట్ట పొలాలు ( uplands )

(2) సముద్ర తీర ప్రాంత సర్కారు జిల్లాలు.

(4) దక్కను జిల్లాలు.

నోట్ :— 1 వ నంబరు ప్రాంతంలో డెల్టా ప్రాంతంకంటె సగటు ఆదాయం అధికంగా చూపబడింది. ఇది వర్షాలు సక్రమంగా పడ్డ సంవత్సరపు ఆదాయన్ని అనుసరించి చేసిన పట్టిక.

మన రాష్ట్ర ప్రజలలో 1951 జనాభా లెక్కల ప్రకారం నూటికి 80.4 మంది గ్రామీణ వాసులే! కనుక, వీరి స్థితి గతుల పరిశీలించడమన్న, ఆంధ్ర ప్రజల స్థితిగతులను అర్థం చేసుకోవడమే! కాని 1951 జనాభా లెఖ్ఖల వివరాలు నేటికీ ప్రకటింపబడలేదు. కనుక 1951 సం॥ కేంద్ర ప్రభుత్వ కేంద్రశాఖ వ్యవసాయ కూలీల జీతాల నిర్ణయానికని గ్రామాలలో జరిపిన పరిశీలనలోని వృత్తుల వివరాలు యిచ్చట తీసుకొనటం జరిగింది. ఈ విచారణలో ఆంధ్ర ప్రాంతాలలో సగటున ప్రజలు ప్రతి 100 కి యిలా విభజింపబడ్డారని తేలింది.

| వృత్తులు | | | మొత్తం జనాభాలో నూటికి ఎన్ని కుటుంబాలు ? |
|---|---|---|---|
| 1. భూ ఖామందులు | ... | ... | 23.9 |
| 2. కౌలుదారులు | ... | ... | 6.7 |
| 3. వ్యవసాయకూలీలు | ... | ... | |
| భూమి ఉన్నవారు | 26.5 | | |
| భూమి లేనివారు | 21.9 | | 48.4 |
| వ్యవసాయంమీద జీవించే మొత్తం కుటుంబాలు | | | 79.0 |
| 1. వ్యవసాయకూలీలు గాక మిగతా కూలీలు (Non-Agricultural Lobourers) | | ... | 2.7 |
| 2. కుమ్మరం, కమ్మరం ఇత్యాది వృత్తులవారు (Artisans) | | ... | 4.7 |
| 3. వ్యాపారస్తులు | ... | ... | 4.1 |
| 4. తదితరులు | ... | ... | 9.5 |
| | | | 21.0 |
| | | మొత్తం | 100.0 |

(Source: Agricultural wages in India. Page 110.)

ఈ విభజన ప్రకారం మన గ్రామీణ జనాభాలో నూటికి 79 మంది ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి జీవిస్తున్నారు. పారిశ్రామికంగా మన రాష్ట్రం ఎంతో వెనుకబడి ఉంది. ఈ రంగంలో అభివృద్ధికూడా చెప్పదగినంత జరగటంలేదు. కనుక క్రమంగా పెరుగుతున్న జనాభా, వ్యవసాయంమీదే ఆధారపడవలసి వస్తున్నది. జనాభా అభివృద్ధి పరిమాణంలో సాగు చేయబడుతున్న భూమికూడా పెరగకపోవుటచేత, వ్యవసాయంమీద వత్తిడి ఎక్కువ అవుతున్నది. ఒక ఎకరం పొలంమీద ఆధారపడుతున్న జనాభా 1911 సంవత్సరంలో 288 గా ఉన్నదల్లా,

1921 సంవత్సరానికి 313 కు, 1931 సంవత్సరానికి 315 కు, 1941 సంవత్సరానికి 326 కు పెరిగిపోయింది. ( Monograph of Rural Problems in Madras 255 పేజి. )

వ్యవసాయంపై ఆధారపడే వారి సంఖ్య అధికమైనకొలది, వ్యవసాయ రంగంలో బీదతనం, నిరుద్యోగం ప్రబలిపోయింది. క్రమంగా చిన్న రైతులు ఉన్న కొంచెమును కోల్పోయి, ఏవిధంగా వ్యవసాయ కూలీలుగా తయారవుతున్నారో క్రింది పట్టిక వివరిస్తుంది.

| వృత్తి వివరం | | 1941 లో నూటికి ఎంతమంది | 1951 లో నూటికి ఎంతమంది |
|---|---|---|---|
| 1. భూఖామందులు | ... | 39.0 | 30.1 |
| 2. వ్యవసాయకూలీలు | ... | 42.9 | 61.2 |
| 3. కౌలుదారులు | ... | 12.0 | 8.5 |

Source: 1941 సంఖ్యలు Monograph of Rural Problems నుండి 1951 సంఖ్యలు Agricultural wages in India " లో వృత్తి, విభజనా వివరాలకు కట్టిన శాతము.

గత పది సంవత్సరాలలో, భూవసతి కలిగి ఉన్న ప్రతి నందమంది ఖామందులలోను తొమ్మిదిమంది దాన్ని కోల్పోయారు. ఇలా కోల్పోయినవారు వ్యవసాయ కూలీలుగా మారినట్లుకూడా పై లెక్కలే స్పష్టం చేస్తున్నాయి. భూమిపై జీవించే ప్రతి నందమందిలో 1941 లో 43 మంది వ్యవసాయ కూలీలుగా వుంటే 1951 నాటికి వీరి సంఖ్య, 61 కి పెరిగింది. భూఖామందులేకాక కౌలు దారులు కూడా క్రమంగా ఈ తరగతిలోకి జారటం జరిగింది.

1936–41 సంవత్సరాల రీ సెటిల్‌మెంటు రిపోర్టులలోని సంఖ్యలుకూడా, మన గ్రామీణ ప్రజలలో వస్తున్న ఈ మార్పును రుజువు చేస్తున్నాయి.

ఐదు ఎకరాలలోపు పట్టాదారులు, 1936 సంవత్సరంలో నూటికి 85 గా ఉన్నవారు, 1941 వచ్చేటప్పటికి 90 మందిగా పెరగటం జరిగింది. కాని 5–15 ఎకరాలమధ్య, 15–100 ఎకరాలకు పైబడి ఉన్న భూఖామందులు క్రమంగా తగ్గుతూ వచ్చారు. అంటే కిందతరగతి రైతాంగంక్రింద ఉన్న భూమి క్రమంగా పలుచబడుతూంటే, పై తరగతి భూస్వాములు క్రమంగా భూమిపై తమ ఆధిపత్యాన్ని విస్తరింప చేసుకుంటున్నారని ఈ లెక్కలు తెలియ చేస్తున్నాయి :

| పట్టాదార్లు | | 1936 లో | 1941 లో |
|---|---|---|---|
| 5 ఎకరాలలోపు | ... | 85% | 90% |
| 5–15 ఎకరాలు | ... | 12.7% | 8% |
| 15–100 – ఆపైన | ... | 2.3% | 2.0% |

ఈ పరిణామం ఫలితంగా ప్రజలయొక్క ఋణభారం క్రమంగా పెరుగుతూ వస్తున్నది. వివిధ తరగతుల ప్రజలు 1939–45 మధ్యకాలంలో అప్పుల బరువుతో ఏ విధంగా ఉన్నది క్రింద ఇస్తున్న పట్టిక రుజువు పరుస్తుంది :

| తరగతి | | సంఘంలో నూటికి ఎంతమంది | ఋణం పెరుగుదల + తరుగుదల( — ) శాతం |
|---|---|---|---|
| 25 ఎకరాలకు పైన ఉన్న భూ ఖామందులు | | 2.9 | — 39.9 |
| 25–5 ఎకరాలమధ్య | ... | 24.6 | — 24.6 |
| 5 ఎకరాలకులోపు | ... | 44.3 | — 12.3 |
| కౌలుదార్లు | ... | 13.2 | + 4.1 |
| వ్యవసాయకూలీలు | ... | 15.0 | + 45.1 |

Source : Report of the Economist for Enquiry into Rural indebtedness నుండి కూర్చబడినవి.

పై తరగతుల జనాభా, వారి వారి అప్పులను తీర్చుకొని, నిల్వలలో పడితే, కింది తరగతివారు మరింత అప్పులపాలవుతూ వస్తున్నారు. బీద, మధ్య రైతాంగం డా॥ నారాయణస్వామి అంచనాల ప్రకారం అప్పులపాలై లేరంటే అర్థం, వారి అవసరాలను కుదించుకొనుట ద్వారాను, ఉన్న కొద్దో గొప్పో క్రమంగా అమ్ముకుంటూ వచ్చి ఋణ భారాలు తొలగించుకొన్నారనేకాని, మరొక విధంగా అర్థం చేసుకోరాదు.

ఈ పరిణామ ఫలితంగా భూమిపై ఆధారపడి జీవించేవారి సంఖ్య గత అర్థ శతాబ్దంలో రెట్టింపు పైబడి పెరిగింది. వీరందరకు భూ ఆధారంతో జీవనాధారం లభించక అనేకమంది నిరుద్యోగులుగా తయారవుతున్నారు. 1931 జనాభా లెక్కల ప్రకారమే, మన రాష్ట్రంలో ఉన్న ప్రతి వెయ్యి మంది జనాభాకు, 'ఏపనీ లేక, సంపాదించేవారిమీద ఆధారపడి ఉన్నవారు 440 మంది ఉన్నట్లు అంచనా వేయబడినది. ( Rural Monograph–Page 24 .)

ఈ నిరుద్యోగులు ఉద్యోగాన్వేషణకొరకు పల్లెపట్లనుండి పట్నాలకు ఎగ బాకటం ప్రారంభించారు. 1941–51 మధ్య కాలంలో కొన్ని మన తెలుగు పట్నాల జనాభా పెరుగుదల వివరాలు పోల్చిచూస్తే, ఈ పరిణామం ఎంత త్వరితగతిని జరుగు తున్నది తెలియగలదు.

| పట్టణం | | జనాభా 1941 | జనాభా 1951 | పెరుగుదల శాతం |
|---|---|---|---|---|
| (1) | విజయవాడ | 86,184 | 1,61,198 | 60.6 |
| (2) | గుంటూరు | 83,599 | 1,25,255 | 39.9 |
| (3) | విశాఖపట్టణం | 70,243 | 1,08,042 | 42.4 |
| (4) | రాజమండ్రి | 74,564 | 1,05,276 | 34.2 |

**Source : 1951 Census Papers No. 1. Pape 24.**

1941–51 సంవత్సరాలమధ్య (పది సంవత్సరాలలో) జనాభా పెరుగుదల సుమారు నూటికి 14 మాత్రమే ఉండగా, పై పట్నాలలో జనాభా పెరుగుదల 34% నుండి 60% వరకు పెరిగిందంటే, ఇది అంతా గ్రామీణవాసుల కదలికవలన గలిగిన పరిణామమే ! ఇలాగే కొద్దీ గొప్ప తేడాలతో ప్రతి పట్టణానికి ఎగ్రబాకటం జరుగుతున్నది.

పారిశ్రామికంగా అభివృద్ధికాని మన పట్నాలు, వీరికెట్టి పనిపాటలు కల్పించలేకపోవటంచేత చిన్న వ్యాపారస్తులుగాను, రిక్షాబండ్లు లాగేవాండ్లుగాను దిగబడే కొంతమందిని మినహాయించి, మిగతావారు భుక్తికై పర రాష్ట్రాలకూ, పర దేశాలకు వలసలు పోతున్నారు.

1931 జనాభా లెక్కలప్రకారం ఒక్క బర్మాకు విశాఖ జిల్లానుండి 63,000, గోదావరినుండి 44,000, కృష్ణా జిల్లానుండి 15,000 మంది వలస పోయా రంటే, ఈ పరిస్థితి ఆ సంవత్సరంలో ఎంత తీవ్ర పరిణామానికి దారితీసింది తెలియ చేస్తుంది. ఈ విధంగా వలసబోయిన ఆంధ్రులు, బర్మాలోను, కలకత్తా, బొంబాయి, ఖరగ్‌పూరు, షోలాపూరు, పూనా మొదలైన పట్నాలలో, లక్షల సంఖ్యలో గలరు.

నేటి సాంఘిక వ్యవస్థ ఫలితంగా ఆంధ్రులు పొట్టను చేత బట్టుకొని, వలసపోవుట అనేది నేటికీ కొనసాగుతూనే ఉన్నది. ఈ పరిణామాన్ని ఆపుచేసి, ఆంధ్రజాతి పురోభివృద్ధికి మార్గం వెయ్యాలంటే, భూమిపై జీవనాధారానికి ఆధార

పడేవారి సంఖ్యను తగ్గించటం అత్యావసరం. ఇందుకు, పారిశ్రామిక ప్రణాళికల అమలు పరచాలి. తద్వారా, రాష్ట్రాన్ని పారిశ్రామికంగా అభివృద్ధిచేసి జీవనోపాధి కల్పించాలి.

అలాగే, నేటి భూస్వామ్య వ్యవస్థ ఫలితంగా క్రమంగా నీరసించి పోతున్న, వ్యవసాయ కూలి, బీద, మధ్య తరగతి రైతులకు ప్రోత్సాహమిచ్చే విధంగా భూసంస్కరణల అమలు జరుపుతూ, ఈ భూస్వామ్య విధానాన్ని రద్దు చెయ్యాలి. అపుడే, ఆంధ్ర జాతి పురోగమిస్తుంది.



# వ్యవసాయం

మన రాష్ట్రంలో నూటికి షుమారు 80 మంది జనాభాకు వ్యవసాయమే జీవనాధారం. కాలం గడచినకొలదీ వ్యవసాయంమీద ఆధారపడే జనాభా పెరుగుతూనే ఉన్నది. 1911 సంవత్సరంలో ఒక ఎకరంమీద ఆధారపడిన జనాభా 288 అయితే, ఇది 1921 సంవత్సరానికి 313 కు, 1931కి 315 కు, 1941 కి 326 కు పెరిగిపోయింది.

ఈ విధంగా వ్యవసాయంపై జీవించేవారి సంఖ్య పెరుగుతూంటే, సాగు చేయబడే భూమి అదే పరిమాణంలో పెరగకపోవుటచేత, తల 1 కిసగటు సాగుచేయబడే భూమి విస్తీర్ణం ఎల్లా తగ్గుతున్నదో ఈ క్రింది అంకెలు తెలియ చేస్తాయి :

| సంవత్సరం | | తల 1కి సగటున (మద్రాసు రాష్ట్రంలో) సాగుచేయబడుతున్న భూమి |
|---|---|---|
| ◆1911 | ... | 0.78 ఎకరాలు |
| ◆1921 | ... | 0.79 ,, |
| ◆1931 | ... | 0.78 ,, |
| ◆1941 | ... | 0.69 ,, |
| *1951 | ... | 0.56 ,, |

సాగు చేయబడే భూమి పెరగక పోవడంతోపాటు, అధునాతన వ్యవసాయ పద్ధతులుకూడా అభివృద్ధి కాలేదు. జల వసతులున్నా, నీటి పారుదల సౌకర్యాలు లేవు. మొత్తం సాగు చేయబడే భూమిలో, నాల్గవవంతు భూవిస్తీర్ణానికి మాత్రమే నీటి పారుదల సౌకార్యాలున్నాయి. మిగతా మూడు వంతుల భూమి

◆ ఈ వివరాలు Monograph of Rural Problems in Madras నుండి.

* ఇవి మేము వేసిన అంచనా.

సేద్యానికి వర్షాలపై ఆధారపడవలసి ఉన్నది. కొయ్య నాగళ్ళతో భూమి దున్నటం, ఎద్దుల మోటలతో నీటి పారుదల– ఇదీ నేటి మన వ్యవసాయ పద్ధతి! క్రింద పొందు పరచిన వివరాలు మన సేద్యం ఎంతగా పురాతన పరికరాలతో జరుగుతున్నదో వ్యక్తం చేస్తాయి.

12, 83, 725 కొయ్యనాగళ్ళు ఉపయోగించ బడుతూంటే, 17,891 ఇనుప నాగళ్ళు మాత్రమే వాడకంలో ఉన్నాయి. 14,221, చెరుకు గానుగలు ఎడ్లతో ఆడించబడుతూంటే, విద్యుత్ (కరెంటు) తో ఆడించబడేవి 170 మాత్రమే! *టి మదరాసు రాష్ట్రంలో 3,690 ఆయిల్ ఇంజన్‌తో పని చేసే పంపు సెట్లు, 4,307 కరెంటు పంపు సెట్లు వాడబడుతూంటే, మనరాష్ట్రంలో 906 ఆయిలు ఇంజన్లతో నడపబడే పంపుసెట్లు, 812 కరెంటు పంపుసెట్లు మాత్రమే వాడబడుతున్నాయి. ఈ పురాతనవ్యవసాయ పద్ధతుల ఫలితంగా ఎకరానికి ఉత్పత్తికూడ తగ్గిపోతున్నది.

ఇతర దేశాల సగటు ఉత్పత్తితో మన ఉత్పత్తిని పోల్చి చూస్తే మన వ్యవసాయం ఎంతగా వెనుకబడి ఉన్నదో అవగతమవుతుంది.

| దేశం పేరు | | సగటు, ఎకర వరిధాన్యపు ఉత్పత్తి. (పౌనులలో) |
|---|---|---|
| స్పెయిన్ | ... | 3,709 |
| జపాన్ | .. | 2,053 |
| ఇటలీ | ... | 2,963 |
| ఈజిప్టు | ... | 1,779 |
| చైనా (కొమింటాంగ్) | ... | 1,554 |
| అమెరికా (U. S. A.) | ... | 1,413 |
| మదరాసు (ఆంధ్రతో) | ... | 1,050 |

(Monograph of Rural Problems in Madras State. P. 172.

దీనికి తోడు సాగుకు లాయక్కైన భూమి దాదాపు 83 లక్షల ఎకరాలు సాగు చేయబడటంలేదు. ఇందులో కొంత బంజరుగాను, మరికొంత నీటి సౌకర్యాలు లేక, తరుణంలో వర్షాలు లేక పడావు (fallows) గాను పడిఉంది.

ఈ విధంగా వృధాగా ఉంటున్న భూమి 1950–51 సంవత్సరంలో ప్రభుత్వ అంచనాల ప్రకారం (Season & Crop Report) 82,75,423 ఎకరాలు. ఆ సంవత్సరం సాగుచేయబడిన భూమిలో నూటికి 48.2 పాళ్ళు.

* పైన ఉదహరించిన వ్యవసాయ పరికరాలకు సంబంధించిన అంచనాలు మదరాసు ప్రభుత్వ ఆర్థిక సలహాదారు శ్రీ నటరాజన్‌వి.

దీని వివరాలు ఇలా ఉన్నాయి :

| వృధాగా ఉన్న భూమి వివరాలు | ఎన్ని ఎకరాలు ? | మొత్తం సాగుచేయ బడిన భూమిలో ఎన్నోవంతు? |
|---|---|---|
| 1. సాగుకు లాయకైన బంజరు | 35,60,156 | 21.0% |
| *2. ఒక్కసంవత్సరం మించకుండా పడావుగా ఉన్న భూమి (Current fallows) | 25,59,048 | 15.1% |
| ♦3. పడావుభూమి (Other fallow lands) | 21,56,219 | 12.1% |
| వృధాగా ఉంచబడిన సాగుకు లాయకైన భూమి మొత్తం | 82,75,423 | 48.2% |

మన వ్యవసాయాభివృద్ధికి ప్రధాన ఆటంకంగా తయారైనవాటిలో భూస్వామ్య విధానం ఒకటి. దున్నే రైతు క్రమంగా ఉన్నకొంచెం పోగొట్టుకొని కూలీగా మారుతున్నాడు. భూమి అంతా భూస్వాముల చేతుల్లో క్రమంగా కేంద్రీకృత మవుతున్నది.

మదరాసు రాష్ట్రంలో నూటికి 94 గురు పట్టాదారుల చేతుల్లో, సాగు చేయబడే భూమిలో మూడింట రెండుపాళ్ళు మాత్రమే ఉన్నది. మిగతా మూడవ వంతు భూమి, నూటికి ఆరుగురుగావున్న పట్టాదారుల చేతుల్లో ఉన్నది. నూటికి ఒక్కరుగా ఉన్న పట్టాదారుల చేతుల్లో, మొత్తం సాగుచేయబడే భూమిలో నూటికి పదునాల్గువంతుల భూమి ఉన్నది. (Monograph of Rural Problems in Madras State—నుండి P. 67.)

1900–01—1950–51 సంవత్సరాల కాలంలో, యాభై – ముప్ఫై రూపాయలు శిస్తు చెల్లించే పట్టాదారులు, మూడవ వంతు భూమిని కోల్పోయారు.

రూపాయి – అంతకు తక్కువ శిస్తు చెల్లించే చిన్న పట్టాదారుల భూమి 1900–01 సంవత్సరంలో సగటున 0.77 ఎకరాలు ఉన్నదల్లా 1950–51 సంవత్సరానికల్లా 0.71 ఎకరాలకు పడిపోయింది. అలాగే పది – రూపాయిమధ్య శిస్తు చెల్లించే పట్టాదారులు నాలుగవవంతుకంటె కొంచెం ఎక్కువ భూమినే కోల్పోయారు. నూరు – యాభై రూపాయలు శిస్తు చెల్లించే పట్టాదారులుకూడా సుమారు నాల్గవవంతు భూమిని కోల్పోయారు.

* ఇది మామూలుగా సాగుచేయబడుతున్న భూమి. కాని ఆ సంవత్సరంలో మాత్రం వర్షాలు సకాలంలో పడకపోవటంచేత, ఇంత భూమిలో పైరు వేయబడలేదు.

♦ ఇవీ సేద్యం చేయబడుతున్న భూములే. ఒక సంవత్సరంనుండి ఐదు సంవత్సరాలవరకు వరుసగా బీడుగా వదలివేయబడుతున్న విస్తీర్ణం.

ఇదే అభిప్రాయాన్ని, అఖిల భారత కాంగ్రెసు సంఘంచేత నియమించబడి, వ్యవసాయ సంస్కరణల విషయంలో విచారణ జరిపి, రిపోర్టు తయారు చేసిన కుమారప్ప కమిటీకూడ వెల్లడించింది.

జనాభాలో అధిక సంఖ్యాకులైన చిన్న రైతులనుండి భూమి స్వయంగా సేద్యం చేయని భూస్వాముల చేతులలోనికి పోతున్నట్లు మదరాసులో జరిపిన ఒక విచారణలో తేలిందనీ, ఇది చాలా అలజడి గలిగించే విషయమనికూడా శ్రీ సత్యనాథన్, కుమారప్ప కమిటీకి సమర్పించిన విజ్ఞాపనలో తెలియచేశారు. (కుమారప్ప కమిటీ రిపోర్టు – P. 40.)

ఇలాగే, మరొక ప్రముఖ మదరాసు రైతు నాయకుడు ఈ కమిటీ ముందు సాక్ష్యమిస్తూ, "భూమి అంతా, ఎండ కన్నెరుగని వ్యవసాయదారుల" చేతుల్లోకి పోయిందనీ, ఈ అవాంఛనీయ పరిణామాన్ని చక్కగా చిత్రీకరించారు." (అదే గ్రంథము – P. 40.)

ఈ "అవాంఛనీయ" పరిణామ ఫలితంగా (దున్నేవారి చేతినుండి భూమి సేద్యం చేయని భూస్వాముల (noncultivating land-lord) చేతిలోకి పోవడంవల్ల వ్యవసాయోత్పత్తి ఎంత తీవ్రగతిని తగ్గిపోతున్నదో క్రింద పొందు పరచబడిన సంఖ్యల వివరాలు స్పష్టం చేస్తాయి.

1943–'44—1949–'50 సంవత్సరాల మధ్య కాలంలో ఎకరానికి సగటున పండిన వరి, జొన్న పంటలు. *

| సంవత్సరం | సగటున ఎకరానికి పండిన పంట | |
|---|---|---|
| | వరిపంట (టన్నుల్లో) | జొన్న పంట (టన్నుల్లో) |
| 1943—44 | 0.673 | 0.250 |
| 1944—45 | 0.684 | 0.268 |
| 1945—46 | 0.620 | 0.225 |
| 1946—47 | 0.668 | 0.220 |
| 1947—48 | 0.618 | 0.233 |
| 1948—49 | 0.613 | 0.240 |
| 1949—50 | 0.570 | 0.242 |

— "మదరాసు రాష్ట్రంలో ఆహారం – వ్యవసాయం" అనే గ్రంథంలో – 215–218 పేజీలలో ఇవ్వబడిన పంట భూమి విస్తీర్ణం – పంట వివరాలు ఈ సగటు అంచనాలకు మూలము.

* ఈ అంచనాలు, మదరాసు రాష్ట్రానికంతకు సంబంధించినవి.

ఈ భూస్వామ్య వ్యవసాయ విధానం ఫలితంగా ఎకరా సగటు ఉత్పత్తి తగ్గిపోవుటయేగాక – సేద్యంక్రింద ఉన్న భూమి ఎదుగూ పొదుగూ లేకుండా వచ్చింది. లక్షలకొలది ఎకరాలకు నీటి పారుదల సదుపాయాలు లేక పడావులుగా ఉండుటచేత, మరికొన్ని లక్షలు బంజర్లుగా ఉండుటచేత, సంవత్సరం సంవత్సరానికి పెరుగుతున్న జనాభా దృష్ట్యా మనలో తల ఒకటికి ఉన్న పండింపబడే భూవైశాల్యం క్షీణిస్తూ వచ్చింది. భూ వైశాల్యం తల ఒకటికి క్షీణించినా, సాగుక్రింద ఉన్న భూమిలోనైనా నవీన పద్ధతులతో వ్యవసాయం జేసి, ఉత్పత్తిని పెంపొందించక పోవుట చేత, తల ఒక్కంటికి పండే ఆహార ధాన్యాల ప్రమాణంకూడ క్రమంగా క్షీణిస్తూ వస్తున్నది. భూస్వామ్యవిధాన నగ్నస్వరూపం ఇదే! క్రింద యిచ్చిన పట్టిక గత 12 సంవత్సరాలలో జరిగిన యీ పరిణామాన్ని స్పష్టం చేస్తుంది.

1938–39—1949–50 సంవత్సరాలలో తల 1 కి

ఆహారపంటలు పండించబడుతున్న భూమి - పంట. *

| సంవత్సరం | తల 1కి ఆహారపంటలు పండించబడుతున్న భూమి (ఎకరాలలో) | తల 1కి పండించబడుతున్న ఆహారపంట (పౌనులలో) |
|---|---|---|
| 1938—39 | 0.4765 | 308.0 |
| 1939—40 | 0.4713 | 331.0 |
| 1940—41 | 0.4731 | 362.4 |
| 1941—42 | 0.4712 | 340.8 |
| 1942—43 | 0.4654 | 308.8 |
| 1943—44 | 0.4731 | 323.8 |
| 1944—45 | 0.4518 | 324.8 |
| 1945—46 | 0.4187 | 262.8 |
| 1946—47 | 0.4326 | 291.5 |
| 1947—48 | 0.4081 | 261.9 |
| 1948—49 | 0.4235 | 269.1 |
| 1949—50 | 0.4164 | 242.4 |

— మదరాసు రాష్ట్రంలో ఆహారము – వ్యవసాయం.

— బి. నటరాజన్ - ప్రభుత్వ ప్రచురణ. P. 45.

1943 – 1949 సంవత్సరాల మధ్య కాలంలో, మదరాసు ప్రభుత్వం, అధికాహారోత్పత్తి పేర, సుమారు ఏడుకోట్ల ముప్ఫై ఆరు లక్షలరూపాయలు ఖర్చు చేసి

* మదరాసు రాష్ట్రపు సగటు సంఖ్యలు.

నప్పటికి, ఈ ప్రయత్నం, అధికోత్పత్తిని సాధించలేకపోయింది సరికదా, ఆహార పంటల ఉత్పత్తి పతనాన్ని సయితం ఆపలేకపోయింది.

ఇలాగే, ఆహారేతర పంటలుకూడా (సగటున ఎకరానికి పండేపంట) తగ్గిపోయాయని ఈ దిగువ పొందుపరచిన సంఖ్యా వివరాలు తెలియ చేస్తాయి:

| పంట పేరు | పండిన పంట – (సగటున – ఎకరానికి) | | |
|---|---|---|---|
| | 1939 – 40 | 1940 – 41 | 1949 – 50 |
| వేరుశనగ ... | 0.478 టన్నులు | — | 0.413 టన్నులు |
| పత్తి ... | 0.227 బేళ్ళు ♦ | — | 0.214 బేళ్లు |
| పొగాకు ... | — | 0.406 టన్నులు | 0.241 టన్నులు |
| ఆముదాలు ... | — | 0.102 టన్నులు | 0.089 టన్నులు |
| నువ్వులు .. | — | 0.130 టన్నులు | 0.117 టన్నులు |

— "మదరాసు రాష్ట్రంలో ఆహారం - వ్యవసాయం" అను గ్రంథంలో 215-18 పేజీలలో ఇవ్వబడిన సంఖ్యల ఆధారంతో ఈ అంచనాలు తయారు చేయబడినవి.

— ఈ వివరాలు మొత్తం మదరాసు రాష్ట్రానికి సంబంధించినవి.

భూమి, దున్నే రైతు చేతిలోంచి, దున్నని భూస్వాములు, జమీందారులకు సంక్రమించడం వలన, కలుగుతున్న విషఫలితాలు స్పష్టంగా గోచరిస్తున్నాయి. జమీందారీ - భూస్వామ్య విధానం, మన వ్యవసాయ క్షీణతకు ప్రధాన కారణమనే విషయం నిర్వివాదాంశం. ఈ విషయాన్ని అఖిల భారత కాంగ్రెసుకూడా అంగీకరించింది.

ఈ విషమ పరిస్థితులనుండి మన వ్యవసాయం బైట పడటానికి మార్గం, భూస్వాముల, జమీందార్ల భూములను పేద రైతులకు, వ్యవసాయ కూలీలకు పంచి ఇవ్వడంతప్ప మరొక్క మార్గంలేదు అనేది అందరూ అంగీకరించారు. అయితే, వీరి భూములను పంచునపుడు, వీరికి కనీస పరిమితి భూమి వదలాలా, ఇలా వదలేట్లయితే, ఆ కనీస పరిమితి ఎంత? అనే విషయాలపై అందరు ఏకగ్రీవాభిప్రాయాన్ని వెల్లడించలేదు.

మదరాసు ప్రభుత్వం "భూమి శిస్తు సంస్కరణల కమిటీ—సుబ్రహ్మణ్యం కమిటీవారు" రెండువందల యాభైరూపాయలకు పైబడి శిస్తు చెల్లించేవారు ఎవరూ ఉండకూడదు అనే అభిప్రాయాన్ని వెల్లడించారు.

ఈ పరిమితికి పైబడి శిస్తు చెల్లించే పట్టాదారులకింద మన రాష్ట్రంలో సుమారు ఎనిమిది లక్షల అరవై వేల (8,60,000) ఎకరాలు ఉన్నది. ఈ భూమిని పేద రైతులకు, వ్యవసాయ కూలీలకు పంచవచ్చు. ఇదేకాక, ఈ భూస్వాములు

♦ బేలు = 400 పౌనులు

పడావులుగా సంవత్సరాల తరబడి వదలివేస్తున్న భూమి సుమారు ఇరవై లక్షల ఎకరాలున్నది. దీనినీ పంచవచ్చు. నేడు సాగు చేయబడుతున్న భూమిలో దాదాపు 5 వ వంతు విస్తీర్ణపు భూమి, సాగుకు లాయకైన బంజరుగా పడివున్నది. దీనినీ పంచవచ్చు. అంటే కాంగ్రెస్ ప్రభుత్వం నియమించిన సుబ్రహ్మణ్యాం కమిటీ సిఫార్సుల ననుసరించే 250 రూ. పైబడి శిస్తు చెల్లించేవారు లేకుండా చేయటంద్వారా షుమారు 65–66 లక్షల ఎకరాలు పంచవచ్చు. ఈ భూ వైశాల్యం మొత్తం ఆంధ్రలో సాగు చేయబడు భూ వైశాల్యంలో నూటికి 38 పాళ్లు పైబడి వుంటుంది. అనగా షుమారు మూడవవంతు పైబడి. ఆంధ్రలో 250 రూ. పైబడి శిస్తు చెల్లించే వారిని రద్దు చేసిన పంచ వీలున్న మొత్తం యీ క్రింది విధంగా వుంటుంది.

| వి వ ర ం | భూమి ఎకరాల్లో | మొత్తం పండించే భూమి విస్తీర్ణంలో ఎంత శాతం |
|---|---|---|
| (1) రు. 250 లు ఆపైన శిస్తుచెల్లించే పట్టాదారుల క్రింద ఉన్నభూమి | 8,63,513 | 5.1 |
| (2) పడావులుగా సంవత్సరాల తరబడి భూస్వాములచేత వదలివేయబడుతున్నభూమి | 21,56,219 | 12.1 |
| (3) సాగుకు లాయకైన బంజరు | 35,60,156 | 21.0 |
| మొత్తం భూమి | 65,79,888 | 38.2 |

గమనిక : ఈ అంచనాలు స్థూలంగా ఒక అభిప్రాయాన్నిస్తాయేగాని, అక్షరాలా సరిపోగే అంచనాలు మాత్రం కావు.

— టేబులులోని 2, 3 సంఖ్యా వివరాలు, ( Season and Crop Report—Madras State 1950-51 నుండి, 1 వ వివరం Monthly Digest of Statics and Economics, ఆగస్టు, 1952 సంచిక నుండి సేకరించబడినవి.

భూస్వామ్య విధాన విష ఫలితంగా దిన దినం క్షీణిస్తున్న మన వ్యవసాయాన్ని పునరుద్ధరించాలన్న భూస్వాముల అదనపు భూమిని పేద రైతులకు, వ్యవసాయకూలీలకు పంచడం అత్యావసరం. అప్పుడే నేడు కౌలుదారులుగా వున్న వారు, భూవసతి పొందిన వ్యవసాయకూలీలు, పేద రైతులు తమ సర్వ శక్తిని ఉత్పత్తిని పెంచ కేంద్రీకరించగల్గుతారు. ఈ విధంగా సగటు ఉత్పత్తి ఎంతో పెరుగుతుంది.

పైన పేర్కొనిన 65 లక్షల ఎకరాలు యీ రూపంలోనికి సేద్యంలోనికి తెచ్చినప్పుడు ఆంధ్రలో తలఒకటికి పండే ఆహారపదార్థాల విలువ చాలా హెచ్చుగా పెరుగుతుంది. నీటి వసతులుకూడ గల్గించుటద్వారా ప్రస్తుత సంవత్సరం పడావులుగా

ఉన్న 25 లక్షల 59 వేల ఎకరాలను సాగులోనికి కొనిరావచ్చు. ఈ సంస్కరణల ద్వారా నేడు సాగులోవున్న భూమిలో షుమారు సగంభాగం కొత్తసాగుగా మనకు కలుస్తుంది. లక్షల ఎకరాలు పేద రైతులకు, వ్యవసాయ కూలీలకు దక్కినప్పుడు వారి శ్రమశక్తి అదనపు పంటగా యీ భూములలో ఫలిస్తుంది. ఆరోజు ఆంధ్ర గ్రామ సీమలు నేటి దారిద్ర్యం, నిరుద్యోగం బదులు సిరి సంపదలతో పొంగి పొరలుతుంటాయి.

## * 1938-39—1949-50 సం॥ల మధ్య, వ్యాపార పంటల వివరాలు - (అంకెలు వేలలో)

| సంవత్సరం | వేరుశనగ | | పత్తి | | పొగాకు | | ఆముదం గింజలు | | నువ్వులు | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పండించబడిన విస్తీర్ణం ఎకరాల్లో | పండిన పంట టన్నులలో | పండించబడిన విస్తీర్ణం ఎకరాల్లో | పండినపంట ఎన్ని బేళ్ళు (400 పౌన్లు బేలు) | పంట పండించబడిన విస్తీర్ణం ఎకరాలు | పండిన పంట (టన్నులలో) | పంట పండించబడిన విస్తీర్ణం ఎకరాలలో | పండిన పంట టన్నులలో | పండించబడిన విస్తీర్ణం ఎకరాలలో | పండిన పంట టన్నులలో |
| 1938-39 | 37,70 | 16,12 | 19,28 | 3,69 | 3,20 | 1,19 | 2,67 | 22 | 8,76 | 93 |
| 1939-40 | 36,17 | 17,21 | 21,96 | 4,52 | 3,07 | 1,41 | 2,66 | 25 | 7,34 | 89 |
| 1940-41 | 39,22 | 19,24 | 24,12 | 5,30 | 3,10 | 1,26 | 2,66 | 27 | 7,86 | 1,02 |
| 1941-42 | 27,84 | 11,82 | 25,40 | 5,62 | 3,33 | 1,29 | 2,43 | 23 | 6,93 | 84 |
| 1942-43 | 33,82 | 13,04 | 22,09 | 4,70 | 2,84 | 1,13 | 2,77 | 22 | 8,39 | 97 |
| 1943-44 | 35,50 | 16,03 | 21,87 | 4,82 | 2,33 | 93 | 2,79 | 24 | 6,96 | 81 |
| 1944-45 | 42,99 | 19,51 | 16,70 | 3,81 | 3,28 | 1,32 | 2,84 | 25 | 6,16 | 76 |
| 1945-46 | 41,65 | 15,63 | 16,11 | 3,60 | 3,63 | 1,32 | 2,35 | 19 | 5,99 | 67 |
| 1946-47 | 41,21 | 16,90 | 15,66 | 3,35 | 3,03 | 1,08 | 2,29 | 19 | 6,72 | 78 |
| 1947-48 | 40,66 | 16,00 | 12,97 | 2,66 | 2,93 | 1,07 | 2,40 | 20 | 6,38 | 72 |
| 1948-49 | 36,98 | 14,80 | 16,32 | 3,41 | 3,22 | 1,14 | 2,29 | 21 | 6,12 | 70 |
| 1949-50 | 37,67 | 15,56 | 16,91 | 3,63 | 3,45 | 83 | 2,23 | 20 | 7,59 | 89 |

* ఈ వివరాలు మదరాసు రాజధాని అంతటికి సంబంధించినవి.

— మదరాసు రాష్ట్రంలో "ఆహారం - వ్యవసాయం" అనే గ్రంథంనుండి పేజి 215-18.

# ఆహార-ఆహారేతర పంటల వివరాలు (1950 - 51)

| జిల్లా | ఆహార పంటలు (ఎకరాల్లో) | ఆహారేతర పంటలు (ఎకరాల్లో) | మొత్తం పంటభూమి (ఎకరాల్లో) | ఒకసారికంటె ఎక్కువ సార్లు పైరు వేసే భూమి (ఎకరాల్లో) | మొత్తం పంట పండించే భూమి (Net area cropped) (ఎకరాల్లో) |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం—విశాఖ | 16,01,690 | 4,28,790 | 20,30,480 | 5,90,000 | 14,40,480 |
| తూర్పు గోదావరి | 10,77,050 | 2,36,320 | 13,13,370 | 3,17,000 | 9,96,370 |
| పశ్చిమ గోదావరి | 9,18,830 | 1,77,510 | 10,96.340 | 2,44,000 | 8,52,340 |
| కృష్ణా | 10,81,240 | 2,96,080 | 13,37,320 | 1,83,000 | 11,94,324 |
| గుంటూరు | 16,72,390 | 7,38,400 | 24,10,790 | 2,63,000 | 21,47,790 |
| కర్నూలు | 14,80,530 | 6,61,800 | 21,42,330 | 57,000 | 20,85,330 |
| అనంతపూరు | 14,56,090 | 6,42,520 | 20,98,610 | 83,000 | 20,15,610 |
| కడప | 7,93,550 | 2,88,630 | 10,82,180 | 85,000 | 9,97,180 |
| నెల్లూరు | 12,65,830 | 1,61,010 | 14,26,840 | 1,64,000 | 12,62,702 |
| చిత్తూరు | 6,21,050 | 2,22,680 | 8,43,730 | 1,11,000 | 7,32,730 |
| బళ్ళారి (మొత్తం) | 16,21,120 | 8,91,390 | .25,12,510 | 1,81,000 | 23,31,510 |

Source:—Season & Crop Report of Madras State 1950 - 51 Page 60.

# నదులు - ప్రాజెక్టులు

ఆంధ్ర దేశంగుండా రెండు ప్రధాన నదులు - కృష్ణా, గోదావరులు ప్రవహిస్తున్నాయి. అయినా మొత్తం వ్యవసాయంక్రిందనున్న 188 లక్షల ఎకరాలలో సుమారు 24 లక్షల ఎకరాలు మాత్రమె నదీజలాలచే సాగు చేయబడుతున్నాయి. ఆయకట్టు వివరాలు, ఏ జిల్లాలలో ఎంతెంత సాగు చేయబడుతున్నది ఈ క్రింది పట్టీ తెలియచేస్తుంది.

| నీటి వనరు | లాభం పొందే జిల్లాలు | విస్తీర్ణం ఎకరాలలో |
|---|---|---|
| గోదావరి డెల్టా :- | తూర్పు గోదావరి | 5,46,022 |
| | పశ్చిమ గోదావరి | 6,58,101 |
| | కృష్ణాజిల్లా | 2,742 |
| | | 12,06,865 |
| కృష్ణా డెల్టా :- | పశ్చిమ గోదావరి | 41,106 |
| | కృష్ణాజిల్లా | 5,40,290 |
| | గుంటూరుజిల్లా | 4,06,219 |
| | | 9,87,615 |
| కర్నూలు కడపకాలువ (తుంగభద్ర నీరు) | కర్నూలుజిల్లా | 45,513 |
| | కడపజిల్లా | 35,841 |
| | | 81,354 |
| పెన్న | నెల్లూరుజిల్లా | 1,98,118 |
| | ఈ నదీజలాలతో సాగయ్యే మొత్తం భూమి | 23,92,599 |

గోదావరి ఆయకట్టు అన్నింటిలోకి పెద్దదయినా, నదీ జలాలలో నూటికి 6 పాళ్లు మాత్రమే సాగుకు ఉపయోగించుకొనబడుతున్నది. కృష్ణానది నీటితో సుమారు పది లక్షల ఎకరాలు సాగు చేయబడుతున్నా, నూటికి 8 పాళ్ళ నీరు మాత్రమే సాగుకు ఉపయోగించబడుతున్నది.

మన రాష్ట్ర భాగానికి వచ్చే నదీ జలాలను సముద్రంపాలు కాకుండా నూతన ప్రాజెక్టుల నిర్మాణంద్వారా సద్వినియోగం చేసుకుంటే, ఆంధ్ర దేశాన్ని మొత్తంగా సస్య శ్యామలం చేయవచ్చు. నందికొండ, సిద్ధేశ్వరం, తుంగభద్ర (హైలెవల్ కెనాల్), గండికోట, రామపాదసాగరం మున్నగు ప్రాజెక్టుల నిర్మాణమును గూర్చి అనేక పరిశోధనలు జరిగిఉన్నా ఈ నాటికీ, ఆంధ్ర దేశంలో ఏ ఒక్క ప్రాజెక్టూ నిర్మించబడలేదు.

సుమారు 30 వేల చ॥ మై॥ వైశాల్యం గలిగి, 50 లక్షల పైగా జనాభా నివసించే, రాయలసీమ జిల్లాలయిన అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు, బళ్ళారి జిల్లాలు; గుంటూరు, కృష్ణా జిల్లాలలోని మెట్ట ప్రాంతాలు తరచు కరువు రాక్షసికి ఎర అవుతున్నవి,

ప్రభుత్వ లెక్కల ప్రకారం, సుమారు 8½ లక్షల ఎకరాలకు రాయలసీమ ప్రాంతంలో నీటి పారుదల సౌకర్యాలు ఉన్నట్లు కనిపిస్తున్నది. నిజానికి, కడప - కర్నూలు కాలువద్వారా సాగయ్యే 80 వేల ఎకరాలకు మినహా, మరెచ్చటా గ్యారంటీ అయిన నీటి వనరులు లేవు. మిగతా భాగమంతా వర్షంపై ఆధారపడే నూతులద్వారా, చెరువులద్వారా సాగు చేయబడుతున్నది. కాని, ఈ ప్రాంతంలో సంవత్సరాలుగా మంచి వర్షాలు పడకపోవటంచేత, ఆ పడే కొద్ది సకాలంలో పడక పోవటంచేత, బావులు, చెరువులు, వ్యవసాయానికేగాదు, మనుష్యులకు తాగటానికి కూడా నీటిని సప్లయి చేయలేకపోతున్నాయి.

1900 - 1942, సంవత్సరాల మధ్య అనేకసార్లు తీవ్ర క్షామానికి రాయల సీమ జిల్లాలు గురి ఐనట్లు ప్రభుత్వమే అంగీకరిస్తున్నది. ప్రభుత్వ అంచనాలలో కరువు ప్రాంతమని గుర్తించబడటమంటే, ఆకలి చావులు, పెద్ద ఎత్తున వలసలు సంభవిస్తేనే! నేటి రాయలసీమ జిల్లాలలో ఆహారకొరత, నీటి కరువు నిత్యమే అయినా, ప్రతి ఐదు సంవత్సరాలకు ఒక పర్యాయం, తీవ్ర కరువు కాటకాలు సంభవిస్తున్నాయి.

ఈ పరిస్థితులతో యిచ్చట ప్రజలు నిత్యం కరువు రాక్షసితో సతమత మవుతుండగా, వ్యవసాయ భాగంలో యిచ్చిన ప్రభుత్వ లెఖ్ఖలలో యీ జిల్లాలలో 8,51,141 ఎకరాలు నీటి వనరులు కల్గి ఉన్నాయని తెలియజేయబడింది. నిజానికి నీళ్ళు వుండనిబావులు, చెరువులు రాయలసీమలో సమృద్ధిగానే ఉన్నాయి. కాని అవి

సాగుచెయ్య తోడ్పడే భూమిమాత్రం శూన్యం. ప్రజలకే నీళ్లు కరువయితే, యిక వ్యవసాయానికెచ్చటనుంచి? ప్రభుత్వ లెక్కలు రాయలసీమ జిల్లాలోని బావులు, చెరువులూ అన్నీ సమృద్ధి అయిన వర్షాలతో నిండి వ్యవసాయానికి తోడ్పడుతున్నట్లు చిత్రిస్తున్నాయి. ఇవి ప్రభుత్వ లెక్కలలోని బూటకత్వాన్ని ప్రకటిస్తాయి.

నదీ జలాలను సద్వినియోగం చేసుకొని, ఆంధ్రదేశాన్ని సస్య శ్యామలం చేయాలంటే, నిర్మాణానికి అనువయిన ప్రాజెక్టులు ఆంధ్ర దేశంలో ఎన్నో ఉన్నాయి. రాయలసీమ ప్రజల తక్షణసమస్యగా తుంగభద్ర హైలెవల్ కెనాలును గండికోట ప్రాజక్టును నిర్మించడం, కె. సి. కెనాలును వెడల్పు చేయటంతోపాటు నందికొండ, సిద్ధేశ్వరం ప్రాజక్టుల నిర్మాణంగూడ తీసుకొన్న ఆంధ్రదేశంయొక్క ఆకారాన్నే చాలవరకు మార్చవచ్చు. నందికొండ, సిద్ధేశ్వరం ప్రాజక్టుల నిర్మాణంతో కర్నూలు, నెల్లూరు, గుంటూరు, కృష్ణా జిల్లాలలోని మెట్ట ప్రాంతాల సస్యశ్యామలం చేయటమేగాక – తెలంగాణాలోని నల్లగొండ, వరంగల్లు జిల్లాలలోకూడ లక్షలాది ఎకరాలను సస్య శ్యామలంగా జేయ తోడ్పడుతాయి. ఈ ప్రాజక్టులనుండి వుత్పన్నమయ్యే విద్యుచ్ఛక్తి నుండి పరిశ్రమలను వృద్ధి పొందించవచ్చు. ఇలానే ఆంధ్ర భూమిని సస్యశ్యామలంగా జేయ తోడ్పడే నీటి వనరులు ప్రతిజిల్లాలోనూ వున్నాయి. ప్రక్కపేజీలో పొందుపరచ బడిన పట్టిక కొన్ని ముఖ్యమైన, మైనరు, మేజరు ఇరిగేషన్ ప్రాజెక్టులను, వాటి ద్వారా లాభించే జిల్లాలు, సాగయ్యే భూమివివరాలు తెలియపరుస్తుంది.

షావుకారు కొన్న పెన్సిళ్ళకు రంగుకాగితం అంటించి ఐదువేల చొప్పున పెట్టెల్లో పెట్టి, ఎగుమతిచేస్తాడు. ఈవిధంగా 1943 లో రు 76,128 లు విలువగల 6,844 పెట్టెలు, 1944 లో రు. 63,072 లు విలువగల 5,256 పెట్టెలు ఎగుమతి చేశారు. శ్రేష్ఠమైన పలకరాయి మనకు విశేషంగా లభించుతున్నా దీనిని పారిశ్రామిక పద్ధతులలో నవీన యంత్రాలను వినియోగించి ఒక పరిశ్రమగా అభివృద్ధి చేయుటకు ఏ చర్యలూ తీసుకొనబడలేదు.

ఆంధ్రలో చెప్పుకోతగ్గ భారీ పరిశ్రమలు లేకపోగా, అనేకమంది ప్రజలకు జీవనాధారాలయిన గ్రామీణ పరిశ్రమలు సమసిపోయినవి పోగా, ఉన్నవి అదే దోవలో ఉన్నాయి. వీటి పునరుద్ధరణకు పూనుకోవలసిన అవసరం సులభగ్రాహ్యమే.

---

# విద్యుచ్ఛక్తి

ఆంధ్ర దేశం విద్యుదుత్పత్తిలోను, వాడకంలోను వెనుకపడి వున్నది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన అమెరికా, స్విట్జర్లండ్, సోవియట్ యూనియన్‌వంటి దేశాలకంటె మాత్రమే కాదు, తోటి తమిళ దేశంకంటె కూడా ఎంతో వెనుకబడి వున్నది. జలవసతులు అపారంగా వున్నా ఒక్క జల విద్యుదుత్పత్తి కేంద్రం ( Hydro - electric system ) కూడా మనకు లేదంటే, విద్యుదుత్పత్తిలో మన రాష్ట్రం ఎంతగా వెనుకపడి వున్నదో విశదమవుతుంది.

ప్రస్తుతం ఆంధ్రలోని 16 విద్యుదుత్పత్తి స్టేషన్లలో 3 స్టీమ్‌తోను(నీటియావిరి) 13 డీసెల్ ఇంజన్లతోను నడుపబడుతున్నాయి. ఇవి పరిపాలనా సౌలభ్యంకోసం రెండు గ్రూపులుగా విభజించబడ్డాయి. మొదటిగ్రూపు ఆంధ్ర పవరుసిస్టం, రెండవ గ్రూపు రాయలసీమ పవరుసిస్టం.

ఆంధ్ర పవరుసిస్టంక్రింద ఈదిగువ థర్మల్‌స్టేషన్లు ఉన్నాయి: విశాఖపట్నం, విజయవాడ, (ఈరెండు స్టీమ్ థర్మల్‌స్టేషన్లు), కాకినాడ, నరసారావుపేట, శ్రీకాకుళం, రాజమండ్రి, ఒంగోలు.

రాయలసీమ పవరుసిస్టంక్రింద ఈ దిగువ థర్మల్‌స్టేషన్లు ఉన్నాయి:— నెల్లూరు, (స్టీముథర్మల్‌స్టేషను), కర్నూలు, అనంతపురం, ప్రొద్దుటూరు, కడప, నంద్యాల, గూండూరు, తాడిపత్రి. మైసూరునుండి కొన్న జలవిద్యుత్‌ను పంచే స్టేషన్లు రెండు: ఒకటి బళ్ళారిజిల్లాలోని కేంద్రం. ఇది జాగ్ పవర్ స్కీమునుండి కొన్న పవరును పంచుతుంది. రెండవది: అనంతపురంజిల్లా హిందూపూరు కేంద్రం. ఇది శివసముద్రం స్కీమునుండి కొన్న పవరును పంచుతుంది.

1951–52 సంవత్సరంలో ఈ రెండు సిస్టంల క్రింద ఉన్న విద్యుత్ ప్రవాహపు లైనుల పొడవు ఈవిధంగా ఉన్నది :

| సిస్టం పేరు | హై టెన్షన్ లైనులు మైళ్ళలో | లో టెన్షన్ లైనులు మైళ్ళలో | మొత్తం పొడవు మైళ్ళలో |
|---|---|---|---|
| ఆంధ్రా పవరు సిస్టం | 836 | 454 | 1,290 |
| రాయలసీమ పవరుసిస్టం | 318 | 333 | 651 |
| మొత్తం పొడవు | 1,154 | 787 | 1,941 |

ఈ రెండు సిస్టంల క్రింద పనిచేసే థర్మలు స్టేషన్ల ఉత్పత్తిశక్తి, అవి 1951–'52 లో చేసిన ఉత్పత్తి ప్రక్క పేజీలోని పట్టీలో ఉదహరించబడింది.

ఈ పవరు స్టేషన్ల ఉత్పాదకశక్తి (Generating Capacity) 1951 – '52 లో 32,177 కిలోవాట్లయితే డిమాండు 19,793 కిలోవాట్లున్నది.

ఆంధ్ర దేశంలోని పవరు స్టేషన్లు అన్నీ కలసి, 1951–52 లో, 5,60.79 లక్షల యూనిట్ల విద్యుత్‌ను ఉత్పత్తి చేశాయి. ఇది చాలక, గత కొన్ని సంవత్సరాలుగా కొంటున్నట్లే, మైసూరులోని జాగ్ జల విద్యుత్ కేంద్రంనుండి, శివసముద్రం జల విద్యుత్ కేంద్రంనుండి, ఇదే సంవత్సరంలో 131.7 లక్షల యూనిట్ల విద్యుత్తు కొనబడినది. అంటే, ఆంధ్ర దేశ వినిమయం నిమిత్తం, మొత్తం 692.49 లక్షల యూనిట్లు విద్యుత్తు సప్లయి చేయబడింది.

రాష్ట్రంలోని థర్మలు స్టేషన్లు అన్నీ చేసే ఉత్పత్తిలో, పవరు థర్మలు స్టేషన్లు నూటికి సుమారు 88 పాళ్ళు, డీసిల్ స్టేషన్లు 12 పాళ్లు ఉత్పత్తి చేస్తున్నాయి. రాష్ట్రపు మొత్తం ఉత్పత్తిలో ఒక్క బెజవాడ, విశాఖపట్నం థర్మలు స్టేషనులే నూటికి 83 పాళ్ళు ఉత్పత్తి చేస్తున్నాయి. మిగిలిన 14 స్టేషన్లు ఉత్పత్తి చేసేది 17 పాళ్ళు మాత్రమే!

మొత్తం రాష్ట్ర వినిమయంలో, దాదాపు నాల్గవవంతు పవరును బైటి నుండి కొంటున్నామంటే, విద్యుదుత్పత్తిలో మనం ఎంత వెనుకబడి ఉన్నామో అవగతమవుతుంది.

మన రాష్ట్రంకంటె, పరిశిష్ట మదరాసురాష్ట్రం పదమూడురెట్ల యూనిట్లు (72,99,70 వేలు) విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తున్నది. అంటే తోటిరాష్ట్రంలో తల 1 కి సగటున సుమారు 24 యూనిట్లు ఉత్పత్తి చేయబడుతూంటే, ఆంధ్రలో తల 1 కి సగటున 2.7 యూనిట్లే ఉత్పత్తి చేయబడుతున్నది.

## 1951 – '52 సం॥ లో – డిమాండు, ఉత్పత్తి చేయబడిన విద్యుత్తు

| పవరు సిస్టం పేరు | డిమాండు కిలోవాట్లు | ఉత్పత్తి చేస్తున్న విద్యుత్తు లక్షల యూనిట్లలో | నీటి ఉత్పత్తిశక్తి కిలోవాట్లు |
|---|---|---|---|
| (అ) ధర్మల్ స్టేషన్లు స్కీమ్ | | | |
| 1. విశాఖపట్నం | 4,500 | 159.60 | 6750 }<br>1200 } |
| 2. విజయవాడ | 8,309 | 309.00 | 13000 |
| 3. నెల్లూరు | 750 | 26.50 | 5000 |
| (ఆ) డీసిల్ స్టేషన్లు | | | |
| 4. కాకినాడ | 1020 | 23.60 | 1434 |
| 5. కర్నూలు | 360 | 10.70 | 807 |
| 6. కడప | 200 | 7.60 | 835 |
| 7. అనంతపురం | 184 | 4.29 | 495 |
| 8. గొండూరు | 40 | 0.58 | 104 |
| 9. శ్రీకాకుళం | 104 | 1.70 | 250 |
| 10. నర్సరావుపేట | 18 | 0.30 | 170 |
| 11. ఒంగోలు | 98 | 1.10 | 170 |
| 12. ప్రొద్దుటూరు | 90 | 2.30 | 170 |
| 13. నంద్యాల | 114 | 0.60 | 470 |
| 14. తాడిపత్రి | 58 | 0.52 | 470 |
| 15. రాజమండ్రి | 790 | 11.60 | 802 |
| 16. సాలూరు – పార్వతీపురం | 26 | 0.80 | — |
| మైసూరువద్ద కొన్న పవరు | | | |
| 1. రాయలసీమ స్కీమ్ | 2880 | ♦1,27.00 | |
| 2. హిందుపురం | 252 | ♦4.70 | |
| మొత్తం ... | 19,793 | 5,60.79 | 32,177 |

♦ ఇది కొన్న పవరు గనుక, ఉత్పత్తి చేయబడిన మొత్తం పవరులో చేర్చబడలేదు.

Source: Administration Report of the Electricity Department for 1951—'52 Pages 2,3,100, 101.

వినిమయమవుతున్న కొద్ది విద్యుత్ ఏ ఖాతా క్రింద ఎంత వాడబడుచున్నదో క్రింద పొందుపరచబడిన వివరాలు తెలియజేస్తాయి.

విద్యుత్ వినిమయ వివరాలు (1951 - '52)

| వినియోగించబడే పద్దు | మొత్తం ఉత్పత్తిలో నూటికి ఎన్ని పాళ్లు | |
|---|---|---|
| | * ఆంధ్ర | మదరాసురాష్ట్రం |
| పరిశ్రమలకు | 43.54 | 62.0 |
| వ్యవసాయానికి | 10.02 | 13.5 |
| ఇండ్లకు, (Domestic Consumption) | 25.30 | 10.0 |
| వ్యాపారంలో | 12.20 | 7.0 |
| వీధిదీపాలు | 2.78 | 2.5 |
| ఇతరత్రా వినియోగం | 6.16 | 5.0 |
| | 100.00 | 100.0 |

* (పై గ్రంథములోని వినిమయ అంచనాల ఆధారంతో తయారు చేసిన ఊజ్జాయింపు అంచనాలు)

పారిశ్రామికాభివృద్ధికి, అధికఉత్పత్తికి పనిచేసే కార్మికులకు ఫ్యాక్టరీలో ఆరోగ్యవంతమైన వాతావరణానికి విద్యుత్ చాల అవసరం. కాని వినిమయానికి వున్న మొత్తం విద్యుత్‌లో పరిశ్రమలకు నూటికి 43.54 పాళ్ళు మాత్రమే వినియోగించబడుతున్నది. మనకు భారీ పరిశ్రమలు లేవు. మనకున్న "పరిశ్రమలు" అత్యధిక భాగం రైసుమిల్లులు, వేరుశనగ ఫ్యాక్టరీలు, చిన్నచిన్న వర్కుషాపులు మాత్రం. కనుక పరిశ్రమల కుపయోగించబడుతున్నదన్న విద్యుత్, ఈ పరిశ్రమలకే వినియోగించ బడుతున్నది.

తోటి మదరాసు రాష్ట్రం, నూటికి 62 పాళ్ళు విద్యుత్‌ను పరిశ్రమలు నడపటానికి ఉపయోగిస్తున్నదనే విషయం ఇచ్చట గమనార్హం!

మన రాష్ట్రంలో వ్యవసాయానికి సుమారు నూటికి పదిపాళ్ళు మాత్రమే వినియోగించబడుతున్నది. ఈ కొంచెమయినా బావులలోనుంచి నీరు తోడటంలాంటి పనులకు మాత్రమే వినియోగించబడుతున్నది. పరిశ్రమల విషయంలో మదరాసు రాష్ట్రంకంటె వెనుకబడి వున్నాము కనుక, అంత ప్రమాణంలో మనం విద్యుత్‌ను పరిశ్రమలకు వాడలేకపోయామని సంతృప్తి చెందినా, వ్యవసాయరంగంలో విద్యుత్‌ను వాడటంలోకూడా మనం వెనుకబడే వున్నాము.

ఉదాహరణకు ఆంధ్రలోని రెండు "సిస్టం"ల క్రింద 3097 కిలోవాట్ల లోడ్ గల 831 పంపుసెట్లు 1951-'52 సంవత్సరంలో వాడబడుతూంటే, మదరాసు రాష్ట్రంలో 60,657 కిలోవాట్ల లోడ్ గల 14,717 పంపు సెట్లు వాడబడుతున్నాయి.

ఇప్పటికి పరిస్థితి ఇంత అధ్వాన్నంగా వుంటే, భవిష్యత్ నిర్మాణ కార్యక్రమాలు ఎలా సాగుతున్నాయో చూద్దాం.

ఒరిస్సా-ఆంధ్ర సరిహద్దులో కట్టబడుతున్న మాచిఖండ్ ప్రాజక్టువద్ద నిర్మించబడే జలవిద్యుత్ ఉత్పత్తి కేంద్రం, 1955 నుండి పనిచేయడం ప్రారంభిస్తుందని, దానినుండి ఆంధ్రకు 24,150 కిలోవాట్లు ( KW ) విద్యుత్ వస్తుందని ప్రభుత్వం ఆశించుచున్నది.

మన రాష్ట్రంలో ప్రప్రథమంగా వుపయోగపడబోయే జల విద్యుత్ ఇదే! ఈ విద్యుత్ పరిమాణం, ప్రస్తుతం రాష్ట్రములో వున్న థర్మలు స్టేషను లన్నింటి ఉత్పాదక శక్తి ( Production capacity ) - 32,177 కిలోవాట్లు - కంటె కొంచెం అధికం.

తుంగభద్ర ప్రాజెక్టునుండి, 1956 కు, 30 వేల కిలోవాట్ల విద్యుత్ ఉత్పత్తి ప్రారంభమవుతుంది. క్రమంగా 1,70 వేల కిలోవాట్లకు పెంచబడుతుందట. ఇందులో ఆంధ్రకు ఎన్నోవంతు వస్తుందీ, మైసూరుకు ఎంత పోతుందీ నిర్ణయించ బడవలసిఉంది.

ఈ విద్యుత్‌ను ఫలప్రదమైన పద్ధతిలో వుపయోగించుకొనేందుకు మనకు పరిశ్రమలా లేవు. మరేవిధంగా ప్రభుత్వం దీనిని సద్వినియోగం చేయబోతున్నదో తెలియదు.

మన రాష్ట్రంలో జలవిద్యుత్‌ను విపరీతంగా ఉత్పత్తి చేసే అవకాశా లున్నాయి. నందికొండ, సిద్ధేశ్వరం, పులిచింతల, రామపాదసాగరం, శబరి ఇత్యాది మేజరు ప్రాజెక్టులను నిర్మించితే, సుమారు 5-6 లక్షల కిలోవాట్ల జలవిద్యుత్తును ఉత్పత్తిచేయటానికి వీలున్నదని ఇప్పటికి వేయబడిన అంచనాలు తెలియజేస్తున్నాయి. నందికొండ, సిద్ధేశ్వరం, పులిచింతల ప్రాజెక్టులద్వారా సుమారు 2,40 వేల కిలోవాట్ల జలవిద్యుత్తును తీయవచ్చుననియు, మొదటిదశలో యూనిట్ విద్యుత్ వుత్పత్తిఖర్చు నాలుగుపైసలు వుంటుందనియు, ఎనిమిదికోట్ల రూపాయలు అదనంగా ఖర్చుచేస్తే వుత్పత్తి పెరుగుదలతోపాటు, వుత్పత్తిఖర్చు కానీకి తగ్గుతుందనియు ఖోస్లాకమిటి అంచనావేసింది.

అందుచేత ఈ ప్రాజెక్టుల నిర్వాహణంతో, లక్షల యకరాలకు నీటిపారుదల సౌకర్యం ఒనగూడటంతోపాటు, అతి చౌకగా విద్యుత్‌ను పరిశ్రమలకేగాక, గ్రామ సీమలకు కూడా విరివిగా సప్లయి చేయవచ్చు.

## వివిధ పవరు సిస్టంల 1951 - '52 సం॥ జమా ఖర్చులు

(అంకెలు – లక్షల రూపాయలు)

| సిస్టం పేరు ధర్మలు స్టేషను | ఎన్ని సం॥ల నుండి పని చేస్తున్నది | మొత్తం పెట్టుబడి | మొత్తం ఆదాయం | ఖర్చు | నష్టము | లాభము |
|---|---|---|---|---|---|---|
| 1. విశాఖపట్నం | 13 | 79.28 | 13.59 | 13.59 | — | |
| 2. విజయవాడ | 13 | 141 36 | 19.06 | 19.06 | — | |
| 3. కాకినాడ | 12 | 19.89 | 6.22 | 6.32 | 0.10 | |
| 4. కర్నూలు | 6 | 4.83 | 1.98 | 1.82 | — | 0.16 |
| 5. కడప | 4 | 8.67 | 1.77 | 1.80 | 0.03 | |
| 6. అనంతపురం | 3 | 5.74 | 1.00 | 1.13 | 0.13 | |
| 7. సొండూరు | 3 | 0.77 | 0.17 | 0.25 | 0.08 | |
| 8. రాజమండ్రి | 3 | 10.65 | 2.81 | 3.90 | 1.09 | |
| 9. నెల్లూరు | 2 | 61.88 | 3.01 | 5.76 | 2.75 | |
| 10. ఒంగోలు | 1 | 2.62 | 0.25 | 0.46 | 0.21 | |
| 11. నర్సరావుపేట | 1 | 1.98 | 0.37 | 0.65 | 0.28 | |
| 12. సాలూరు – పార్వతీపురం | 1 | 0.27 | 0.30 | 0.20 | — | 0.10 |
| 13. శ్రీకాకుళం | 1 | 1.22 | 0.50 | 0.64 | 0.14 | |
| 14. ప్రొద్దుటూరు | 1 | 3.59 | 0.56 | 0.68 | 0.12 | |
| మైసూరువద్ద కొన్న విద్యుత్తు | | | | | | |
| 1. రాయలసీమజిల్లాలు | 3 | 80.03 | 8.54 | 6.97 | — | 1.57 |
| 2. హిందూపూరు | 2 | 3.63 | 0.68 | 0.52 | — | 0.16 |
| | | | 60.81 | 63.75 | 4.93 | 1.99 |

Source: Administrative Report of the Electricity Department for 1951-'52 లోని అంచనాల ఆధారంతో ఈ పట్టీ తయారు చేయబడినది.

## 1951 - '52 సం॥లో విద్యుత్ సప్లయి చేయబడుతున్న గ్రామాలు.

| తాలూకా | | | | గ్రామాలు |
|---|---|---|---|---|
| 1. శ్రీకాకుళం జిల్లా | | | | 21 |
| శ్రీకాకుళం తాలూకా | ... | ... | 3 | |
| చీపురుపల్లి ,, | ... | ... | 6 | |
| విజయనగరం ,, | ... | ... | 7 | |
| సాలూరు ,, | ... | ... | 3 | |
| బొబ్బిలి ,, | ... | ... | 1 | |
| పార్వతీపురం ,, | ... | ... | 1 | |
| 2. విశాఖపట్నం జిల్లా | | | | 24 |
| విశాఖపట్నం తాలూకా | ... | ... | 11 | |
| అనకాపల్లి ,, | ... | ... | 3 | |
| వీరవల్లి ,, | ... | ... | 1 | |
| భీమునిపట్నం ,, | ... | ... | 9 | |
| 3. కృష్ణాజిల్లా | | | | 54 |
| నూజివీడు తాలూకా | ... | ... | 11 | |
| విజయవాడ ,, | ... | ... | 21 | |
| గన్నవరం ,, | ... | ... | 20 | |
| బందరు ,, | ... | ... | 2 | |
| 4. గుంటూరు జిల్లా | | | | 18 |
| గుంటూరు తాలూకా | ... | ... | 12 | |
| ఒంగోలు ,, | ... | ... | 1 | |
| నర్సరావుపేట ,, | ... | ... | 1 | |
| తెనాలి ,, | ... | ... | 1 | |
| బాపట్ల ,, | ... | ... | 3 | |

| తాలూకా | | | | గ్రామాలు |
|---|---|---|---|---|
| 5. తూర్పుగోదావరిజిల్లా | | | | 25 |
| కాకినాడ తాలూకా | ... | ... | 4 | |
| పెద్దాపురం ,, | ... | ... | 1 | |
| పిఠాపురం ,, | ... | ... | 4 | |
| రామచంద్రపురం ,, | — | — | 7 | |
| రాజమండ్రి ,, | — | — | 8 | |
| అమలాపురం ,, | — | — | 1 | |
| 6. పశ్చిమగోదావరిజిల్లా | | | | 23 |
| ఏలూరు తాలూకా | — | — | 23 | |
| 7. కర్నూలుజిల్లా | | | | 2 |
| కర్నూలు తాలూకా | — | — | 2 | |
| 8. కడపజిల్లా | | | | 4 |
| 9. అనంతపురంజిల్లా | | | | 1 |
| 10. నెల్లూరుజిల్లా | | | | 3 |
| 11. రాయలసీమజిల్లాలలోని ఇతరగ్రామాలు | | | | 18 |
| పవరు సప్లయిచేయబడుతున్న గ్రామాల మొత్తం | | | | 193 |
| తమిళదేశంలో | | | | 1218 |

Source: Administrative Report of the Electricity Department for the year 1951–'52.

# వాణిజ్య వ్యాపారాలు

వాణిజ్య వ్యాపారాల అభివృద్ధి పారిశ్రామికాభివృద్ధిమీద ఆధారపడి వుంటుంది. ఆంధ్ర దేశంలో పరిశ్రమలు తగినంతగా అభివృద్ధి చెందకపోవటంచేత మన వాణిజ్య వ్యాపారాలు, దీనికి వెన్నెముకయిన బ్యాంకులు మున్నగునవికూడా అభివృద్ధి చెందలేదు.

మన ప్రజల అవసరాలకు కావలసిన సరుకులలో (Manufactured goods) చాల భాగం దిగుమతి చేసుకుంటున్నాం. మనం ఎగుమతి చేసే పొగాకు, నూనెలు, మైకా, మాంగనీసు, తోళ్ళు, మొదలైనవన్నీ ముడి సరుకులుగానే ఎగుమతి చేయడం జరుగుతున్నది. మనం వుత్పత్తి చేసే సరుకుల నన్నిటిని, ముడివిగానే ఎగుమతి చేస్తూ, అదే సరుకులతో తయారయ్యే సామగ్రిని (manufactured goods) మనం దిగుమతి చేసుకుంటున్నాం. జాతీయ పరిశ్రమ లేకపోవటం అనే దుర్గతి మూలంగానే, ఎన్నో అవకాశాలున్నా మన వాణిజ్య వ్యాపారాలు అభివృద్ధి చెందలేదు.

వాణిజ్య వ్యాపారాల అభివృద్ధికి, బ్యాంకింగ్ వ్యాపారం ప్రతిబింబమని చెప్పవచ్చు. ఆంధ్రదేశంలో 1946-'47 మదరాసు ప్రభుత్వ ఆర్థిక సలహాదారు డా॥ నటరాజన్ లెక్కలప్రకారం 9 జాయింట్ స్టాక్ బ్యాంకులుమాత్రమే కలవు. ఇవి భారతదేశంలోని మొత్తం బ్యాంకులలో నూటికి 1.7 పాళ్ళు మాత్రమే! వీటి మొత్తం పెట్టుబడి రు. 10,990 వేలు.. ఈ మొత్తం ,భారతదేశ బ్యాంకుల పెట్టుబడిలో నూటికి 2.7 పాళ్ళు మాత్రమే. ఈ తొమ్మిది బ్యాంకుల నిల్వధనము (Reserve fund) రు. 29,91,000. ఈ మొత్తం భారతదేశంలోని బ్యాంకు రిజర్వు నిధిలో నూటికి 1,7 పాళ్ళు మాత్రమే! బ్యాంకులలో ఉన్న మొత్తం డిపాజిట్లవిలువ రు. 12,40,43 వేలు. భారతదేశ బ్యాంకులోని డిపాజిట్లలో ఈ మొత్తం నూటికి 1,7 పాళ్ళు మాత్రమే! (Economic Wealh of Andhra - Dr B. Natarajan)

బ్యాంకులవలె సహకార పరపతి సంఘాలుకూడా అభివృద్ధి చెందలేదు. మొత్తం మదరాసు రాష్ట్రంలో లక్షమంది జనాభాకు 29.7 సహకార పరపతి సంఘాలు ఉన్నట్లు లెక్కవేశారు. అంటే, ఆంధ్రలో ఈ సంఖ్య మరింత తక్కువ. బ్యాంకింగ్ పద్ధతి అభివృద్ధి చెందకపోవటంచేత పెద్దఎత్తున జరిగే వాణిజ్య వ్యాపారాలు బహుతక్కువ.

మన సరుకుల రవాణా ప్రధానంగా రైళ్లద్వారా, సముద్రంమీద, నదులు, కాలువల ద్వారా, లారీలద్వారా జరుపబడుచున్నది.

ఇందులో ప్రధాన భాగం, రైళ్ళద్వారా, లారీలద్వారా జరుపబడుతున్నదని చెప్పవచ్చు. లారీలపై జరిగిన ఎగుమతి, దిగుమతులకు సంబంధించినంత వరకు, ఎచ్చటా ఎట్టి లెక్కలు వున్నట్లు కనిపించదు. భారత వాణిజ్యంలో రైళ్ళ ద్వారా ఎంత సరుకు రవాణా చేయబడుతున్నదో తెలిసినా, అందులో ఆంధ్రదేశపు రవాణాకు సంబంధించిన వివరాలు–అంకెలతో సహా–లభించలేదు. కనుక కాలువలపై జరిగే రవాణా, ఓడరేవులద్వారా జరిగే రవాణాలకు మాత్రమే వివరాలు ఇవ్వబడినవి.

## సముద్ర వ్యాపారం :

ఆంధ్ర దేశపు ప్రధాన ఓడరేవు విశాఖపట్నం. ఇదికాక, మనకు కళింగ పట్నం (శ్రీకాకుళం జిల్లా) భీమునిపట్నం, (విశాఖపట్నం జిల్లా) కాకినాడ, (తూర్పు గోదావరి), నరసపూరు (పశ్చిమ గోదావరి) మచిలీపట్నం (కృష్ణా జిల్లా) మైనరు ఓడ రేవులు వున్నాయి. ఇవికాక ఓడరేవు, నిజాంపట్నం మొదలైన అనేక చిన్న చిన్న ఓడ రేవుల ద్వారాకూడా కొంత వ్యాపారం జరుగుతున్నది. కాని, వీటికి సంబంధించిన వివరాలుకూడా ఎచ్చటా లభ్యం కాలేదు.

కాకినాడ ఓడరేవు ద్వారా, ప్రధానంగా ఎగుమతి చేయబడే సరుకు : పొగాకు సుమారు (రు. 5 కోట్ల విలువగలది); తాటినార (రు. 38 లక్షలు) విలువగలది; ఆముదమునూనె, గింజలు ($10\frac{1}{2}$ లక్షల రూపాయల విలువగలవి). (ఎగుమతుల విలువలు 1950 – '51 సంవత్సరానివి.) భీమునిపట్నం, కళింగ పట్నముల ద్వారా, జనుము, గోగునార ; విశాఖపట్నంద్వారా ముడి మాంగనీసు, బొగ్గు మున్నగునవి ఎగుమతి చేయబడుచున్నవి.

పై ఓడరేవులలో ఒక్క విశాఖపట్నం, కాకినాడలు మినహా దిగుమతి వ్యాపారం మరి ఏ ఇతర రేవులద్వారాను జరగటం లేదు. విశాఖపట్నంలోకూడా ఇతర ప్రదేశాలనుండి కొనుబడి అయ్యే ఆహారం మాత్రమే ప్రధానంగా దిగుమతి చేయబడుచున్నది. ఈ దిగుమతుల మొత్తం 67,000 టన్నులు మాత్రమే! విశాఖ నుండి జరిగే ఎగుమతులు సుమారు 9 లక్షల టన్నులవరకూ ఉంటాయి.

**కాలువలమీద రవాణా:**

ఆంధ్రదేశ వ్యాపారంలో ప్రధానభాగం కాలువలద్వారా జరుగుచున్నది. కృష్ణా, గోదావరీ నదుల బకింగ్‌హామ్, దుమ్ముగూడెం కాలువలు ఇందుకు ప్రధాన మార్గాలు. గోదావరి కాలువలలో సంవత్సరంలో 11 నెలలవరకూ, కృష్ణకాలువలలో 10 నెలలవరకూ రవాణాలు జరగ వీలవుతుంది.

కాలువలద్వారా రవాణా అయ్యే ప్రధానసరుకులు:— కట్టడపుసరుకులు (ముక్కురాయి, గుల్లరాయి వగైరా), బియ్యము, ధాన్యము, వంటచెరుకు, కలప, ఉప్పు మొదలైనవి.

గోదావరి కాలువలపై సుమారు రు. 22 కోట్ల విలువగల సరుకు (7,25 వేల టన్నులు) 1948–'49 సంవత్సరంలో రవాణా అయింది. గోదావరికాలువలలో ఆంధ్రదేశంలోని, మరి ఏ ఇతర కాలువలకన్న అధికంగా సరుకు రవాణా జరుగుతున్నది. వీటిపై ప్రధానంగా కలప, పొగాకు, బియ్యము, ధాన్యము రవాణా చేయబడుతున్నాయి.

కృష్ణ కాలువలపై 7 లక్షల టన్నుల సరకు, (రు. 14 కోట్ల విలువ గలిగినది) 48–'49 లో రవాణా చేయబడినది. ఈ కాలువపై కలప, చిల్లర సరుకులు, బియ్యము, ధాన్యం, ప్రధానంగా రవాణా చేయబడుతున్నాయి.

బకింగ్‌హామ్ కాలువపై ఇదే సంవత్సరంలో, 3,26 వేల టన్నుల సరకు, (రు. 6,30 లక్షల విలువ గలిగినది.) రవాణా చేయబడినది. ఇందులో ప్రధానమైనవి ఉప్పు, వంటచెరుకు, పొగాకు, బియ్యం, ధాన్యం మున్నగునవి.

# 1950 - 51 లో ఆంధ్ర ఓడరేవులద్వారా జరిగిన ఎగుమతులు - దిగుమతులు (1)

| సరుకు పేరు | భీమునిపట్నం (విలువ రూ.) ఎగుమతి | భీమునిపట్నం (విలువ రూ.) దిగుమతి | కళింగపట్నం (విలువ రూ.) ఎగుమతి | కళింగపట్నం (విలువ రూ.) దిగుమతి | కాకినాడ (విలువ రూ.) ఎగుమతి | కాకినాడ (విలువ రూ.) దిగుమతి | మచిలీపట్నం (సరుకుటన్నులలో) ఎగుమతి | మచిలీపట్నం (సరుకుటన్నులలో) దిగుమతి | నరసపూరు (సరుకుటన్నులలో) ఎగుమతి | నరసపూరు (సరుకుటన్నులలో) దిగుమతి | విశాఖపట్నం (సరుకుటన్నులలో) ఎగుమతి | విశాఖపట్నం (సరుకుటన్నులలో) దిగుమతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనపనార | 5,80,000 | ... | 30,00,000 | ... | | | | | | | | |
| గోగునార | 4,00,000 | ... | | | | | | | | | | |
| తోళ్ళు | 9,004 | ... | | | 18,750 | | | | | | | |
| వివిధ సరుకుల మొత్తం | | | (సరుకుల ఎగుమతులు మొత్తం టన్నులు 1256) | | | 5,01,018 | 15,213 | ... | | 56 | | |
| పొగాకు | | | | | 5,15,05,330 | | | | | | | |
| తాటినార | | | | | 38,32,330 | | | | | | | |
| బొమికల పిండి | | | | | 10,46,546 | | | | | | | |
| ఎముకలు | | | | | 14,057 | | | | | | | |
| ఆముదం | | | | | 8,83,226 | | | | | | | |
| బర్రె కొమ్ములు | | | | | 1,04,747 | | | | | | | |
| ఉన్ని తివాసీలు | | | | | 74,519 | | | | | | | |
| ఆముదపు గింజలు | | | | | 1,83,765 | | | | | | | |
| నూనె గింజలు | | | | | 1,03,560 | | | | | | | |
| ఇతరతారి సరుకులు | | | | | 1[illegible],582 | | | | | | | |

(మిగతా ప్రక్క పేజీలో)

# 1950 - '51 లో ఆంధ్ర ఓడరేవులద్వారా జరిగిన ఎగుమతులు - దిగుమతులు (2)

| సరుకు పేరు | భీమునిపట్నం (విలువ రూ.) | | కళింగపట్నం (విలువ రూ.) | | కాకినాడ (విలువ రూ.) | | మచిలీపట్నం (సరుకు టన్నులలో) | | నరసపూరు (సరుకుటన్నులలో) | | విశాఖపట్నం (సరుకు టన్నులలో) | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఎగుమతులు | దిగుమతులు | ఎగుమతులు | దిగుమతులు | ఎగుమతులు | దిగుమతులు | ఎగుమతులు | దిగుమతులు | ఎగుమతులు | దిగుమతులు | ఎగుమతులు | దిగుమతులు |
| ఆహార పదార్థములు | | | | | మొత్తం ఎగుమతులు టన్నులు 6,633 | మొత్తం దిగుమతులు టన్నులు 1,543 | | | | | | 33,543 |
| గోనె సంచులు | | | | | | | | | | | | 760 |
| యంత్రి సామగ్రి | | | | | | | | | | | | 1,870 |
| క్రూడాయిల్, పెట్రోలు వంట ఆయిల్సు | | | | | | | | | | | | 23,876 |
| ఇతర సరుకులు | | | | | | | | | | | 1,31,320 | 7,285 |
| బొగ్గు (Bunker Coal) | | | | | | | | | | | 1,10,498 | |
| బొగ్గు | | | | | | | | | | | 4,883 | |
| ముడిమాంగనీసు | | | | | | | | | | | 6,25,481 | |
| వేరుశెనగనూనె | | | | | | | | | | | 6,287 | |
| మొత్తం ... | | | | | | | 15,213 | ... | ... | 56 | 8,78,169 | 67,334 |

Source: Compiled from Commercial Directory (Madras 1952)

# 1948 - '49 లో ఆంధ్రదేశంలోని కాలువలపై జరిగిన సరుకు రవాణా (1)

| సరకు వివరం | గోదావరి కాలువలు సరుకు (టన్నుల్లో) | గోదావరి కాలువలు విలువ (రూపాయల్లో) | కృష్ణా కాలువలు సరుకు (టన్నుల్లో) | కృష్ణా కాలువలు విలువ (రూపాయల్లో) | బకింగ్‌హామ్ కెనాల్ సరుకు (టన్నుల్లో) | బకింగ్‌హామ్ కెనాల్ విలువ (రూపాయల్లో) | దుమ్ముగూడెం కాలువ సరుకు (టన్నుల్లో) | దుమ్ముగూడెం కాలువ విలువ (రూపాయల్లో) |
|---|---|---|---|---|---|---|---|---|
| పత్తి, దాని సంబంధమైన ముడిసరుకు | 836 | 1,92,060 | 754 | 29,67,400 | ... | ... | 11 | 38,500 |
| రంగులు | 147 | 6,81,000 | 114 | 1,47,861 | ... | ... | ... | ... |
| బియ్యం, ధాన్యం | 1,15,615 | 3,11,32,878 | 78,007 | 1,89,04,835 | 7,092 | 21,27,600 | 2 | 616 |
| ఇతర ఆహార ధాన్యాలు | 6,795 | 30,57,570 | 14,129 | 70,64,500 | 6,159 | 55,43,100 | 76 | 34,200 |
| తోళ్ళు-చర్మాలు | 61 | 31,200 | 435 | 6,47,920 | . | .. | ... | ... |
| సారాయి | 133 | ... | 4 | 20,000 | 639 | 23,00,400 | 6 | 33,000 |
| లోహాలు | 4,493 | 79,84,400 | 1,136 | 64,44,100 | ... | ... | .. | ... |
| నూనెలు | 4,195 | 81,80,250 | 1,841 | 30,81,834 | 1,046 | 19,90,500 | 19 | 37,050 |
| నూనె గింజలు | 1,569 | 21,96,600 | 12,883 | 66,99,160 | 598 | 4,18,600 | 37 | 51,800 |
| చిల్లర సరుకులు | 93,050 | 6,97,87,500 | 34,360 | 2,72,88,000 | 365 | 5,47,5 0 | 59 | 44,250 |
| ఉప్పు | 16,683 | 9,14,815 | 1,296 | 7,01,568 | 90,728 | 1,08,87,360 | 173 | 9,515 |
| సుగంధ ద్రవ్యాలు | 367 | 16,14,800 | 12 | 32,400 | ... | ... | ... | ... |
| చక్కెర-బెల్లం | 29,860 | 86,96,300 | 16,991 | 49,60,350 | 611 | 2,74,950 | 31 | 8,450 |
| పొగాకు | 8,626 | 1,27,61,800 | 12,803 | 3,19,66,100 | 7,351 | 1,52,31,800 | 455 | 6,37,000 |
| కట్టడపు సరుకులు | 2,19,487 | 48,04,683 | 4,08,613 | 45,92,347 | 14,406 | 27,22,555 | 60 | 1,02,855 |
| ఇతర సరుకులు | 64,994 | 1,90,89,085 | 34,783 | 57,75,508 | 55,895 | 1,74,41,88 | 109 | 52,795 |

( మిగతా ప్రక్క పేజీలో )

# 1948 - '49లో ఆంధ్రదేశంలోని కాలువలపై జరిగిన సరుకు రవాణా (2)

| సరుకు వివరం | గోదావరి కాలువలు | | కృష్ణా కాలువలు | | బకింగ్‌హామ్ కెనాల్ | | దుమ్ముగూడెం కాలువ | |
|---|---|---|---|---|---|---|---|---|
| | సరుకు (టన్నుల్లో) | విలువ (రూపాయల్లో) | సరుకు (టన్నుల్లో) | విలువ (రూపాయల్లో) | సరుకు (టన్నుల్లో) | విలువ (రూపాయల్లో) | సరుకు (టన్నుల్లో) | విలువ (రూపాయల్లో) |
| కలప | 13,711 | 51,69,950 | 13,770 | 1,10,16,000 | ... | ... | ... | ... |
| వంట చెరుకు | 48,410 | 48,41,000 | 42,390 | 15,26,112 | 1,39,119 | 56,64,760 | ... | ... |
| వెదురు | 19,771 | 64,25,575 | 15,013 | 45,03,900 | 927 | 1,85,400 | ... | ... |
| రాక్షసి బొగ్గు | 307 | 92,100 | 3,934 | 4,40,720 | 1,379 | 1,37,9 0 | 28 | 25,900 |
| జనపనార | 9 | 8,325 | 5 | 700 | ... | ... | ... | ... |
| తెప్పలమీద కలప రవాణా | 77,152 | 3,04,69,315 | 569 | 3,80,100 | ... | ... | 455 | 1,97,600 |
| కిరసన్ వగైరా | ... | ... | ... | ... | 42 | 7,935 | ... | ... |
| మొత్తం ... | 7,26,261 | 21,74,31,386 | 6,98,644 | 13,93,61,414 | 3,26,357 | 6,33,85,240 | 1,521 | 12,73,531 |

నోటు : బకింగ్‌హామ్ కాలువ మొత్తం పొడవు 258 మైII దూరంలో షుమారు 70 మైII తమిళ రాష్ట్రంలో ఉన్నది.

ఆంధ్రరాష్ట్రంలో ఉన్న భాగానికి ప్రత్యేకంగా లెక్కలు దొరకక పోవుటచేత, కాలువంతటికి సంబంధించిన లెక్కలు ఇవ్వబడినవి.

Source : Administration Department of the Public works department Madras presidency for the year 1948-'49 Pages 45, 46 & 47.

# రహదారులు

రైళ్ళు, రోడ్డులు, కాలువలు మన ప్రధాన రహదారులు. మదరాసు – కలకత్తా రైలు మార్గము, మచిలీపట్నం – హుబ్లీ రైలుమార్గం ఆంధ్రదేశం నడిబొడ్డునుండి పోవుచున్నవి. మదరాసు – బొంబాయి రైలుమార్గంకూడా ఆంధ్ర జిల్లాలగుండా పోతున్నది.

మచిలీపట్నం – మార్మగోవా రైలు మార్గము మీటరుగేజి. ఈ మార్గము కృష్ణా, గుంటూరు, కర్నూలు, అనంతపురం జిల్లాలగుండా పోతున్నది. మదరాసు – కలకత్తా లైను (బ్రాడ్‌గేజి) మన ఆంధ్రదేశంలో నెల్లూరు, గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరి జిల్లాలు, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలగుండా పోవుచున్నది. మదరాసు – బొంబాయి మార్గము (బ్రాడ్‌గేజి) ఆంధ్ర జిల్లాలయిన చిత్తూరు, కడప, అనంతపురం, బళ్ళారిజిల్లాలలోని ఆంధ్రప్రాంతంగుండా పోవుచున్నది. ఈ ప్రధాన రైలు మార్గాలు కాక అచ్చటచ్చట బ్రాంచి లైనులుకూడా ఉన్నాయి.

మొత్తం 2,090 మైళ్ల రైలుమార్గం ఆంధ్రదేశంలో ఉన్నది. ఇదిమొత్తం భారతదేశ రైలుమార్గాలలో నూటికి 5 వంతులు మాత్రమే! సుమారున ఆంధ్రదేశ వైశాల్యములోని ప్రతి వంద చదరపుమైళ్లకు 2.1 మైలు రైలుమార్గము మాత్రమే ఉన్నది.

వాల్తేరు, విజయవాడ, గుంతకల్లు ఆంధ్రదేశంలోని ప్రధాన రైల్వే కేంద్రాలు. ఇవికాక గూడూరు, తెనాలి, నిడదవోలు, సామర్లకోట, విజయనగరం, నౌపడా, రేణిగుంట, పాకాల, ధర్మవరం, గుంటూరు, గుడివాడ, భీమవరం మున్నగు చిన్న కేంద్రాలు కలవు. ఈ కేంద్రాలనుండి ముఖ్య రైలుమార్గాలకు ఉపశాఖలు పోతున్నాయి.

రోడ్లు :

మొత్తం ఆంధ్రదేశంలో 16,249 మైళ్ల (1951 లో) పొడవుగలిగిన రోడ్లు ఉన్నాయి. వీనిలో 3,899 మైళ్ళు మట్టిరోడ్లు, 11,963 మైళ్లు కంకరరోడ్లు, 297 మైళ్ళు తారురోడ్లు, 90 మైళ్ళ పొడవుగలిగిన సిమెంటురోడ్లు వున్నవి.

ఆంధ్రజిల్లాలలోకెల్ల చిత్తూరు (1728 మైళ్లు), అనంతపురము (1321 మై॥), కృష్ణా (1,472 మై॥), గుంటూరు (1,672 మై॥), కర్నూలు (1,303 మై॥) జిల్లాలలో రోడ్లు ఇతర జిల్లాలలోని రోడ్లకన్న పొడవు ఎక్కువ.

కరువుపనుల పేరుతో అనంతపురం, చిత్తూరు, కర్నూలు జిల్లాలలో అనేక రోడ్లు నిర్మించబడుటచేత ఈ జిల్లాలలో, ఇతర ప్రదేశాలకన్న పొడవైనరోడ్లుఉన్నవి.

రాష్ట్రంలోని మొత్తం రోడ్ల పొడవులో సుమారు 400 మైళ్ళు మాత్రమే సిమెంటు, తారురోడ్లు. మన రహదార్ల అభివృద్ధికి ప్రభుత్వం తీసుకునే "శ్రద్ధ"కు ఇది చక్కని నిదర్శనము. మిగిలిఉన్న సుమారు 12 వేల మైళ్ళ కంకరరోడ్లలోను, ఏదో కొంత అజమాయిషీక్రింద అట్టిపెట్టబడే ట్రంకురోడ్లు కొద్దిమాత్రమే! మిగిలినవి పల్లెటూరు డొంకల్లా ఉండే రోడ్లు మాత్రమే!

రాష్ట్రంలో 1952 లో 702 రూట్లమీద, సుమారు రెండువేల బస్సులు తిరుగుతున్నాయి.

క్రింది పట్టికలో 1952 సంవత్సరంలో ఎన్ని రూట్లమీద, ఎన్ని బస్సులు తిరుగుతున్నాయో ఇవ్వబడినది :—

| జిల్లా | | రూట్ల సంఖ్య | తిరిగే బస్సులు |
|---|---|---|---|
| శ్రీకాకుళం | ... | 43 | 107 |
| విశాఖ | ... | 45 | 119 |
| తూర్పు గోదావరి | ... | 48 | 196 |
| పశ్చిమ గోదావరి | ... | 47 | 225 |
| కృష్ణ | ... | 36 | 296 |
| గుంటూరు | ... | 55 | 226 |
| నెల్లూరు | ... | 97 | 193 |
| చిత్తూరు | ... | 91 | 183 |
| కడప | ... | 46 | 129 |
| కర్నూలు | ... | 45 | 121 |
| అనంతపురం | ... | 67 | 104 |
| బళ్ళారి | ... | 82 | 111 |
| | మొత్తం | 702 | 2010 |

నోటు : బళ్లారి జిల్లా మొత్తంగా చేర్చబడింది.

Source: Commercial Directory Madras State. Page 435.

# ఆంధ్రరాష్ట్రం

## రహదారులు




ఒరిస్సా
మధ్యప్రదేశ్
హైదరాబాద్
శ్రీకాకుళం
విశాఖపట్నం
కాకినాడ
రాయచూరు
కర్నూలు
తెనాలి
బళ్లారి
అనంతపురం
కడప
బిత్రగుంట
నెల్లూరు
గూడూరు
చిత్తూరు
మదరాసు
తమిళనాడు

బ్రాడ్ గేజ్ రైలుమార్గం

మీటర్ గేజ్ రైలుమార్గం

లక్షజనాభామించిననగరం

జిల్లా ముఖ్య పట్టణం

రోడ్డు

1950 – '51 సంవత్సరంలో ఆంధ్ర దేశపు రోడ్లమీద 3,48,453, మోటారులు, లారీలు, బండ్లు మున్నగునవి తిరిగినట్లు ప్రభుత్వ అంచనా. ప్రభుత్వానికి మన రోడ్లు, 1950 – '51 సంవత్సరంలో రు. 4,63,53,000 ఆదాయాన్ని ఇచ్చినవి. కాని, ప్రభుత్వం వీటిపై 3,69,87,000 మాత్రమే ఖర్చుపెట్టినది.

**కా లు వ లు :**

సుమారు 1200 మైళ్లు పడవల ప్రయాణానికి వీలయిన నదీకాలువ లున్నాయి. ఇందులో ప్రధానమైనవి కృష్ణా (420 మై॥), గోదావరి (498 మై॥) కాలువలు; బకింగ్‌హామ్ కాలువ (ఆంధ్రప్రాంతంలో 200 మై॥) ప్రధానమైనవి.

1948–'49 లెక్కల ప్రకారం సుమారు 7½ లక్షల టన్నుల సరుకు మోయ శక్తిగలిగిన పడవలు యీ కాలువలపై ప్రయాణంచేసినవి. ఒక్క గోదావరికాలువల మీదనే '48–'49 సంవత్సరంలో సుమారు 5,32,000 ప్రయాణీకులు ప్రయాణం చేశారు. కృష్ణ కాలువలపై ఇదే సంవత్సరంలో సుమారు రెండు లక్షలమంది, బకింగ్‌హామ్ కాలువపై 1½ లక్షలమంది ప్రయాణం చేశారు. మొత్తం 8,80,000 మంది యీ సంవత్సరంలో కాలువలమీద ప్రయాణంచేశారు. ప్రయాణ సౌకర్యా లకు, రవాణా సౌకర్యాలకు, కాలువలు ఎంతముఖ్యమైనవో యీ సంఖ్యలు తెలియ చేస్తున్నాయి.

మన కాలువలపై '48–'49 సంవత్సరంలో సుమారు 6,08 వేల రూపా యల ఆదాయం వచ్చింది. ఇందులో గోదావరి కాలువలమీద రు. 1,85 వేలు, కృష్ణ కాలువలమీద రు. 2,42 వేలు, బకింగ్‌హామ్ కాలువమీద రు. 1,71 వెయ్యి వచ్చినది.

## మన రోడ్ల స్వభావ వివరాలు (మార్చి 31, 1951), (మైళ్ళలో)

| సర్కిల్ పేరు | సిమెంటు రోడ్లు | తారు రోడ్లు | కంకరరోడ్లు | మట్టిరోడ్లు | రోడ్ల మొత్తం పొడవు |
|---|---|---|---|---|---|
| 1. విజయనగరం | — | — | 64 | — | 64 |
| 2. ఉత్తర విశాఖపట్నం | 1 | — | 838 | 125 | 964 |
| 3. దక్షిణ విశాఖపట్నం | 8 | 46 | 865 | 122 | 1,041 |
| 4. కాకినాడ | 7 | 35 | 689 | 282 | 1,013 |
| 5. రాజమండ్రి | 3 | — | 476 | 308 | 787 |
| 6. ఏలూరు | 4 | 19 | 754 | 395 | 1,172 |
| 7. కృష్ణ | 20 | 46 | 696 | 710 | 1,472 |
| 8. గుంటూరు | 19 | 6 | 522 | 392 | 939 |
| 9. ఒంగోలు | — | 1 | 574 | 158 | 733 |
| 10. అనంతపురం | 1 | 31 | 1,147 | 142 | 1,321 |
| 11. బళ్ళారి* | 3 | 25 | 1,065 | 190 | 1,283 |
| 12. చిత్తూరు | 1 | 68 | 953 | 706 | 1,728 |
| 13. కడప | 9 | 7 | 943 | 63 | 1,022 |
| 14. కర్నూలు | 3 | — | 1,053 | 247 | 1,303 |
| 15. నెల్లూరు | 11 | 13 | 1,324 | 59 | 1,407 |
| మొత్తం | 90 | 297 | 11,963 | 3,899 | 16,249 |

నోటు : రోడ్ల పొడవులో జిల్లాలవారీ ఇచ్చిన మొత్తం రోడ్లపొడవుకు, సర్కిల్‌వారీ ఇచ్చిన మొత్తం పొడవుకు, వెయ్యిమైళ్ళ తేడా ఉన్నది. ఇది సర్కిల్ డివిజన్‌లో వున్న హెచ్చుతగ్గుల మూలముగా వచ్చిన వ్యత్యాసమని భావిస్తున్నాము.

* బళ్ళారిజిల్లా మొత్తంగా చేర్చబడింది.

Source · Administration Report of the Highways Department 1950–'51. Page 53.

## 1950-'51 లో రోడ్ల ఆదాయ - వ్యయ వివరాలు

| జిల్లా పేరు | తిరిగే బండ్ల మొత్తం | మొత్తం పొడవు (మైళ్ళలో) | రోడ్లపై ఖర్చు | రోడ్లపై ఆదాయం |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం ... | 52,961 | 986 | 20,86,744 | 42,26,647 |
| విశాఖ ... | 2,196 | 894 | 21,37,344 | — |
| తూ॥ గోదావరి ... | 91,669 | 1,625 | 39,64,516 | 77,99,848 |
| ప॥ గోదావరి .. | 66,574 | 1,060 | 44,63,263 | 48,19,170 |
| కృష్ణా .. | 11,354 | 1,275 | 43,74,651 | 50,48,135 |
| గుంటూరు ... | 55,317 | 1,495 | 58,22,337 | 78,53,781 |
| నెల్లూరు ... | — | 1,358 | 30,04,235 | 38,97,134 |
| కర్నూలు ... | 66,765 | 1,248 | 21,76,308 | 30,59,897 |
| బళ్ళారి ... | 1,046 | 1,174 | 15,32,357 | 27,88,451 |
| అనంతపురం ... | — | 1,260 | 12,85,625 | 22,36,972 |
| కడప ... | 571 | 981 | 17,96,382 | 22,95,412 |
| చిత్తూరు ... | — | 1,685 | 23,43,818 | 23,27,799 |
| మొత్తం | 3,48,453 | 15,041 | 3,69,87,580 | 4,63,53,246 |

గమనిక : బళ్ళారిజిల్లా మొత్తంగా చేర్చబడింది.

Source . Administration Report of the Highways Department 1950-'51 Page 111.

## 1948–'49 కాలువ రవాణా వివరాలు

| | గోదావరి కాలువలు | కృష్ణకాలువలు | కర్నూలు కడప కాలువ | బకింగ్‌హామ్ కాలువ | దుమ్మగూడెం కాలువ |
|---|---|---|---|---|---|
| కాలువల్లో పడవలు నడవటానికి వీలయిన దూరం (మైళ్ళలో) | 498 | 420 | 75 | 261 | 2 |
| 1948–'49 సంవత్సరంలో తిరిగిన పడవలమొత్తం సరకు మోయగలశక్తి (tonnage) (టన్నులలో) | 7,72,855 | 6,98,076 | | | 1,066 |
| ప్రయాణీకులు | 5,31,806 | 1,98,768 | | 1,46,937 | 1,044 |
| పడవపన్నులు మొదలైన వాటిద్వారా ఆదాయం | 1,85,423 | 2,41,974 | 513 | 1,71,698 | 11,505 |

నోటు . బకింగ్‌హామ్ కాలువ మొత్తం పొడవు ఇందులో చేర్చబడింది.

Source : Administration Report of the Public works Department for the Year 1948-'49. Page 44.

# విద్య

విద్యా విషయాలలో ఆంధ్రదేశం చాలా వెనుకబడి ఉంది. జనాభాలో షుమారు నూటికి 9 మంది మాత్రమే అక్షరాస్యులు. మిగిలిన 91 మందీ నిరక్షరాస్యులు. అంటే మన రాష్ట్ర జనాభాలోని ప్రతి పది మందికీ తొమ్మిది మందికి చదువను, వ్రాయను చేతగాదు. మనం యీ పరిమితిని గుర్తించినప్పుడే భవిష్యత్తులో మనజాతిని విజ్ఞాన వికాసాలకు ఆటపట్టుగా జేయాలంటే ఎంత తీవ్రంగా కృషి జేయవలసి ఉన్నదో అర్థమవుతుంది.

1949 – '50 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం ఆంధ్ర జిల్లాలలో మొత్తం 18,275 పాఠశాలలు ఉన్నాయి. వీనిలో విద్య నభ్యసించే విద్యార్థుల సంఖ్య 17,59,201. అనగా జనాభాలో యీ విద్యార్థుల సంఖ్య నూటికి 9 కి తక్కువే !

ఆంధ్ర జిల్లాలలోకెల్ల గుంటూరు, కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో హెచ్చు విద్యాలయాలు కలవు. ప్రజలలో విద్యావంతులైన వారి సంఖ్యలోకూడ యీ జిల్లాలదే ప్రథమ స్థానం.

గుంటూరుజిల్లా 2,672 వివిధ విద్యాలయాలతో రాష్ట్రంలో ప్రథమస్థానం వహించుతుంది. కాని విద్యలో జిల్లాప్రజలలో నూటికి 12.4 మందికి మాత్రమే వ్రాయను, చదువనూ వచ్చు. కృష్ణా, పశ్చిమగోదావరులలో వరుసగా 1881, 1769 విద్యాలయాలు ఉన్నా యీ జిల్లాల ప్రజలలో ప్రతి వందమందిలోను 13.2 మంది మాత్రమే అక్షరాస్యులు. సగటు విద్యావంతుల లెఖ్ఖలలో యీ రెండు జిల్లాలే ఆంధ్రలో అగ్రస్థానాన్ని వహిస్తున్నాయి.

ఏజన్సీ ప్రాంతాలను మినహాయించిచూస్తే, ఆంధ్రదేశంలోకెల్ల అనంతపురం, బళ్ళారి, ఉభయ విశాఖలు, చిత్తూరు వెనుకబడి ఉన్నాయి. అనంతపురం జిల్లాలో మొత్తం 841 విద్యాలయాలున్నాయి. ప్రజలలో నూటికి 6.5 మంది మాత్రమే అక్షరాస్యులు. అనంతపురం విద్యావిషయికంగా ఆంధ్రలోకెల్ల వెనుకబడినజిల్లా. ఉభయ

విశాఖలలో 2,660 విద్యాలయాలు ఉన్నా, మొత్తం ప్రజలలో విద్యావంతుల సంఖ్య నూటికి 7.1 మాత్రమే. చిత్తూరుజిల్లాలో నూటికి 7.4 మంది మాత్రమే అక్షరాస్యులు. [జిల్లావారీ వివరాలకు పట్టిక చూడుడు.]

## ప్రా థ మి క వి ద్య :

1950 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం ఆంధ్రజిల్లాలలో 16,795 ప్రాథమిక పాఠశాలలో మొత్తం 15,05,946 మంది బాల, బాలికలు హాజరవుతున్నారు. ఈ సంఖ్య 1949 సం॥ బాలబాలికల సంఖ్యపై షుమారు 50 వేలు అధికం. ఇందులో 9,26,045 మంది బాలురు; 5,79,901 మంది బాలికలు. స్త్రీ పురుష జనాభాలో నేడు ప్రాథమికవిద్య నభ్యసిస్తూన్న బాల, బాలికల శాతం ఎంత అని పరిశీలించిన గాని, మన విద్యా విషయాలు బయటపడవు. ప్రాథమిక పాఠశాలలలో విద్య గడించే బాలురసంఖ్య మొత్తం రాష్ట్రంలోని పురుషుల జనాభాలో 9% మాత్రమే. అలానే విద్యగడించే బాలికలసంఖ్య మొత్తం రాష్ట్ర స్త్రీజనాభాలో 6% కు తక్కువయే!

ప్రాథమిక విద్యాలయాలలో గుంటూరు జిల్లాలో మరి యేజిల్లాకంటే కూడ హెచ్చుమంది విద్యార్థులు – 2,30,748 మంది [1,36,881 మంది బాలురు ; 93,867 మంది బాలికలు] విద్య నభ్యసిస్తున్నారు. అయినా యిచ్చటా వీరి సంఖ్య మొత్తం జనాభాలో నూటికి 10 మంది మాత్రమే! ఆంధ్ర జిల్లాలలోకెల్ల కృష్ణా, పశ్చిమ గోదావరీలలో ప్రాథమిక విద్య నభ్యసించేవారి సగటు సంఖ్య హెచ్చు. కృష్ణా జిల్లాలో ప్రతి 100 మందికి 11 మంది, పశ్చిమ గోదావరిలో ప్రతి వంద మందికీ 11.1 మంది ప్రాథమిక విద్య నభ్యసిస్తున్నారు.

అ న ం త పు ర ం, చిత్తూరు, ఉభయ విశాఖలు యితర జిల్లాలకన్న విద్యా విషయకంగా వెనుకబడి వున్నాయి. [వివరాలకు ప్రాథమిక విద్య జిల్లావారీ పట్టికలో చూడండి.]

ప్రాథమిక విద్యపై ప్రభుత్వం ఖర్చుపెట్టే మొత్తం బ హు స్వ ల్ప ం. దేశంలోని నిరక్షరాస్యతదృష్ట్యా పెద్దమొత్తాలు యి ం దు కు కేటాయించవలసి ఉండగా ప్రతి ప్రాథమిక పాఠశాలలోని విద్యార్థిపై సంవత్సరానికి యీ క్రింది విధంగా మాత్రమే ప్రభుత్వం ఖర్చు బెట్టుతున్నది.

గవర్నమెంటు పాఠశాల :— రు. 23 – 11 – 0
స్థానిక సంస్థలు నిర్వహించే పాఠశాలలు :— రు. 23 – 5 – 0
ఎయిడెడ్ పాఠశాలల్లో :— రు. 21 – 4 – 0
[1949 – '50 లెక్కలు]

ఒకప్రక్క ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యను అమలు జరపాలని ప్రభుత్వం చెబుతున్నా, కొన్ని చోట్ల యీ ప్రాథమిక విద్యాదశలోకూడ విద్యార్థులనుండి జీతాలు వసూలు చెయ్యటం జరుగుతున్నది. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 1949 – '50 సం॥ లో యీ క్రింది విధంగా ప్రాథమిక విద్యార్థులనుండి సగటున వసూలు చెయ్యటం జరిగింది :—

గవర్నమెంటు విద్యాలయాలు : — —
స్థానిక సంస్థల విద్యాలయాలు : రు. 0.11
ఎయిడెడ్ విద్యాలయాలు : రు. 0.69
మొత్తం విద్యాలయాలలో : రు. 0.29.

1960వ సం॥కు మన దేశంలో ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యను బాల బాలికలకు 14 సం॥లు నిండువరకూ అమలు జరుపుతామని మన రాజ్యాంగంలో పొందుపర్చబడింది.

కాని యీ ఉచిత, నిర్బంధ ప్రాథమిక విద్యాప్రణాళిక కొత్తదిమాత్రం గాదు. 1945–'46 నుండే మన ప్రాంతాలలోని కొన్ని నిర్ణీత కేంద్రాలలో యీ ప్రణాళిక ప్రారంభింపబడింది. అయినా యీ నిర్బంధ ప్రాథమికవిద్య ఎచ్చటా జయ ప్రదమైనట్లు కన్పించదు.

ప్రభుత్వ లెఖ్ఖల ప్రకారమే ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యా కేంద్రాలలో విద్యావయస్కులైన బాలబాలికలలో 1948–'49 సం॥ లో నూటికి 88.8 మంది బాలురు, 77.8 మంది బాలికలు పాఠశాలలకు హాజరయితే, 1949–'50 సం॥ లో 77.8% బాలురు, 72.1% బాలికలు మాత్రం హాజరయ్యారు.

[1949–'50 విద్యాశాఖ రిపోర్టునుండి.]

నిర్బంధ విద్యా కేంద్రాలలో విద్యాలయాలకు హాజరవుతున్నట్లు యిచ్చే లెఖ్ఖలు దొంగలెఖ్ఖలనీ, ప్రభుత్వ నిర్బంధ చర్యలనుండి తప్పించుకోడానికి బడిలో విద్యార్థి పేరుమాత్రం జేర్పింపబడుతుందని అందరెరిగిన సత్యమే. అయినా యీసంఖ్య లలోగూడ ప్రభుత్వ ప్రణాళిక బండారం బయట పడక తప్పటలేదు. దీనికి మూల కారణం నిర్బంధ విద్యాప్రణాళికను జయప్రదంచేయను అవసరమైన సాంఘిక, ఆర్థిక చర్యలు ప్రభుత్వం తీసుకొనకపోవటమే.

ఆంధ్రదేశంలో జిల్లాలవారీగా నేడు నడుపబడుతున్న నిర్బంధ విద్యా కేంద్రాల సంఖ్యలు యీ క్రింద యివ్వబడ్డాయి.

| జిల్లా పేరు | | నిర్బంధ విద్యా కేంద్రాలు | | |
|---|---|---|---|---|
| | | 1945-'46 | 1946-'47 | 1947-'48 |
| ఉభయ విశాఖలు | ... | 23 | 22 | 31 |
| తూర్పు గోదావరి | ... | 16 | 15 | 20 |
| పశ్చిమ గోదావరి | ... | 13 | 16 | 13 |
| కృష్ణా | ... | 16 | 17 | 17 |
| గుంటూరు | ... | 67 | 68 | 47 |
| కర్నూలు | ... | 9 | 47 | 36 |
| అనంతపురం | ... | 8 | 45 | 21 |
| కడప | ... | 14 | 30 | 34 |
| నెల్లూరు | ... | 17 | 30 | 40 |
| చిత్తూరు | ... | 31 | 64 | 50 |
| బళ్ళారి | ... | 6 | 35 | 18 |
| | మొత్తం | 220 | 389 | 327 |

గమనిక: బళ్ళారి జిల్లా మొత్తంగా పరిగణించబడింది.

[ 1949 - '50 — ప్రభుత్వ విద్యాశాఖ రిపోర్టు ]

ప్రభుత్వం అమలుజరప పూనుకొన్న నిర్బంధ ప్రాథమికవిద్యా ప్రణాళిక యొక్క నత్తనడక పైఅంకెలు స్పష్టంచేస్తున్నాయి. పైగా 1946-'47 లో ఉన్న నిర్బంధ విద్యా కేంద్రాలల్లోనే 1947-'48 సం॥ లో కొన్ని మూతబడ్డవి. ఇదికాక ఉన్న కేంద్రాలలోకూడ వచ్చే విద్యార్థుల సంఖ్య దినదినం క్షీణించుతూ వచ్చింది. ఈ పరిస్థితులను చక్కబర్చ అనువైన చర్యలు తీసుకోనకపోతే ఉన్న కొద్దిపాటి విద్యా కేంద్రాలుకూడ మూతబడే అపాయముంది. ఈ పరిస్థితులను ఆపుచేయకుండా ప్రభుత్వం భవిష్యత్ కార్యక్రమాన్నిగూర్చి, ప్రణాళికలగూర్చి ఎంత ప్రస్తావించినా, అదంతా బూటకమని భావించక తప్పదు.

ప్రాథమిక విద్యను జయప్రదంగా కొనసాగించాలన్న అనుభవశాలురు, అభిలాషాపరులైన ఉపాధ్యాయుల తరిఫీదును చేయటం అత్యవసరం. ప్రతి విద్యార్థిని గూర్చి వ్యక్తిగత శ్రద్ధ తీసుకునే సావకాశం ఉపాధ్యాయునికి ఉన్నప్పుడే విద్యార్థి యొక్క విద్యాభివృద్ధిని ఉపాధ్యాయుడు చూడగలడు. నేటి మన విద్యాలయాలలో యీ సావకాశాలు ఏకోశానా కన్పించవు.

అనుభవజ్ఞుడైన ఉపాధ్యాయుడంటే కనీసం ట్రయినింగుపొందిన ఉపాధ్యాయుడు. మనకు ప్రాథమిక పాఠశాలలలోనే వీరి సంఖ్య కొరతగాఉంది. జిల్లావారీగా

యిచ్చిన యీ క్రింది పట్టిక ట్రయినింగుపొందిన ప్రాథమిక ఉపాధ్యాయులు- మొత్తం ప్రాథమిక ఉపాధ్యాయులలో ఏ శాతంలో ఉన్నదీ తెలియజేస్తున్నది.

| జిల్లా | | మొత్తం ప్రాథమిక ఉపాధ్యాయులలో ట్రయినింగు పొందినవారి శాతం | ట్రయినింగు పొందిన ఉపాధ్యాయుడు సగటున బోధించే విద్యార్థుల సంఖ్య |
|---|---|---|---|
| ఉత్తర విశాఖ | ... | 86 | 34 |
| దక్షిణ విశాఖ | ... | 90 | 34 |
| తూర్పు గోదావరి | ... | 98 | 39 |
| పశ్చిమ గోదావరి | ... | 97 | 29 |
| కృష్ణా | ... | 94 | 31 |
| ఉత్తర గుంటూరు | ... | 98 | 44 |
| దక్షిణ గుంటూరు | ... | 95 | 30 |
| కర్నూలు | ... | 95 | 33 |
| అనంతపురం | ... | 96 | 33 |
| కడప | ... | 98 | 33 |
| నెల్లూరు | ... | 97 | 31 |
| చిత్తూరు | ... | 95 | 35 |
| బళ్ళారి | ... | 90 | 35 |
| ఏ జన్సీ : | | | |
| విశాఖపట్నం | ... | 61 | 47 |
| తూర్పు గోదావరి | ... | 84 | 30 |
| పశ్చిమ గోదావరి | ... | 73 | 30 |

[ 1949 -'50 విద్యాశాఖ రిపోర్టునుండి ]

అనుభవజ్ఞులయిన ఉపాధ్యాయులు కరువవటం అనేసమస్యయేగాక, ఉన్న వారిపై గూడ తలకుమించిన సంఖ్యలో విద్యార్థులనువప్పజెప్పటచేత, విద్యార్థిపై వ్యక్తిగత శ్రద్ధ తీసుకొనే వీలు లేకుండా పోతున్నది. ప్రాథమికవిద్యలో ఉపాధ్యాయునికి 15-18 మంది విద్యార్థులు దాటి ఉన్న, వారిపై వ్యక్తిగత అజమాయిషీ జరగదు. ఇట్టి పరిస్థితులలో మన పాఠశాలలో ఉపాధ్యాయుడు కనీసం 29 మందినుండి 47 మంది విద్యార్థులవరకూ అజమాయిషీ వహించటం జరుగుతున్నవి. ఫలితం చదువురాని పాఠశాలా కాలాక్షేపం.

ఈ ఉపాధ్యాయులకిచ్చే జీతాలు మరీ అన్యాయం. భావిపౌరులను విద్యావంతులజేసే మహాత్కార్యాన్ని వీరి కొప్పగించి వీరికి డఫేదారులకన్న అధ్వాన్నంగా జీతాలు యివ్వటం జరుగుతున్నది. కనుక వీరు పొట్టకక్కుర్తికి పాఠశాలా నాటకం

కొనసాగిస్తూనే, ప్రక్క ప్రక్కన ప్రయివేట్లు చెప్పుకొని, కరిణీకాలు చూసుకొని పోషించుకోవటం జరుగుతున్నది. దీనిఫలితంగా అత్యధిక ప్రాంతాలలో ప్రాథమిక విద్య ఒక తమాషాగా తయారయినది.

ఈ అధ్వాన్న పరిస్థితుల మూలంగా మొదటిసంవత్సరంలో జేరిన విద్యార్థులలో చాలాభాగం రెండవసంవత్సరంలోనూ; రెండవసంవత్సరంవారు మూడవసంవత్సరంలో, యిలా వరసగా చాలమంది విద్యకే తిలోదకాలివ్వటం జరుగుతున్నది. ఒకటవ తరగతినుండి 5వ తరగతివరకూ ప్రాథమికవిద్యాదశ. ఈ 5 సం॥ విద్య సంపూర్ణమయినప్పుడే అతను అక్షరాస్యుడుగా పరిగణింపబడాలి. కాని మనరాష్ట్ర విద్యాపరిస్థితులు అలా కన్పించవు. ప్రభుత్వ లెక్కలే యీ పరిస్థితిని యిలా వివరిస్తున్నాయి.

1945-'46 సం॥ లో మొత్తం మద్రాసురాష్ట్రంలో 11,39,680 మంది బాల, బాలికలు ఒకటవతరగతిలో చేరారు. వీరు తమ విద్యను వదలకుండా కొనసాగించిన 1949-'50 సం॥ కు 5 వ తరగతికి చేరవలె. కాని 1949-50 సం॥ లో 5 వ తరగతిలో 4,43,554 (దాదాపు మూడవవంతు) మంది మాత్రమే కలరు. మిగతా 6,96,126 మంది మధ్యలో తమ విద్యకు తిలోదకా లిచ్చినవారే.

మరొకవిధంగా యీ సంఖ్యలను అర్థంచేసుకోవాలంటే, 1945-'46 లలో ఒకటవ తరగతిలో జేరిన ప్రతి 4 బాలురు, 4 బాలికలలో 1949-'50 లో 5 వ తరగతిలో 2 బాలురను, ఒక బాలికనుమాత్రమే చూడగలం. అనగా ప్రాథమిక పాఠశాలలో జేరే బాలురలలో 50% బాలికలలో 25% మాత్రమే నిజానికి అక్షరాస్యులుగా పరిగణించబడాలి. ఇదీ మన ప్రాథమిక విద్యాపరిస్థితి.

## సెకండరీ విద్య :

1950 సంవత్సరంనాటి ఆంధ్రజిల్లాలన్నింటిలో 2,02,236 మంది బాల, బాలికలు సెకండరీవిద్యను అభ్యసిస్తున్నారు. మొత్తం జనాభాలో సెకండరీవిద్య నభ్యసించిన వారి సంఖ్య నూటికి ఒకటిమాత్రమే. జనాభాలోని స్త్రీ, పురుషులలో సెకండరీ విద్య నభ్యసించినవారి శాతం పరిశీలించిన ప్రతి 400 మంది స్త్రీలలోనూ ఒక్కర్తె మటుకే (.23%) సెకండరీవిద్య అభ్యసించింది. పురుషులలో ప్రతి 100 మందికి యిద్దరు (1.83%) సెకండరీవిద్య అభ్యసించారు. [జిల్లావారీ వివరాలకు పట్టిక చూడుడు]

1951 మార్చివరకూ తయారయిన ప్రభుత్వలెక్కలప్రకారం మనజిల్లాలలో ఉన్న సెకండరీ విద్యాలయాల సంఖ్య మొత్తం 440 మాత్రమే. 1951 మార్చి అనంతరం తెరవబడిన పాఠశాలలను కల్పుకొన్నా యీ సంఖ్య 500 కు దాటదు. అనగా ఆంధ్రదేశంలో ప్రతి 40 వేలమంది ప్రజలకు ఒక్క సెకండరీ పాఠశాలకలదు. కాని ఒక్క గుంటూరు, కృష్ణాజిల్లాలు రెంటిలోనే షుమారు 175 పాఠశాలలవరకూ గలవు. అనగా రాష్ట్రంలోని మొత్తం పాఠశాలలో మూడవవంతుకు కొంచెం తక్కువగా యీ రెండు జిల్లాలలోనే కలవు.

సెకండరీ విద్యలో రాష్ట్రంలో ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు జిల్లాలు యితర జిల్లాలకన్న ముందుండగా, రాయలసీమ జిల్లాలు, ఉభయ విశాఖలు చాలా వెనుకబడి ఉన్నాయి. విశాఖ, ఉభయ గోదావరులలోని ఏజన్సీప్రాంతాలు మరీ అన్యాయం. ఇచ్చట జనాభాలోని ప్రతి వెయ్యి మందికీ ఒక్కరు మాత్రమే సెకండరీ విద్య అభ్యసించినవారు కన్పించుతారు.

ప్రాథమిక విద్యవలెనే, సెకండరీ విద్యకూడ ప్రభుత్వంనుండి సరిఅయిన ఆదరణను పొందుటలేదు. మొత్తం రాజధాని సగటు అంకెలు మన జిల్లాలకుకూడ వర్తింపజేసి చూసిన నేడు నడుపబడుతున్న ప్రతి 100 సెకండరీ పాఠశాలలలోనూ 50 ప్రయివేటు సంస్థలచేత; 35 లోకల్ బోర్డులచేత ; 8 మున్సిపాలిటీలచేత, 7 మాత్రమే ప్రభుత్వంచేత నడుపబడుచున్నవి. ఆంధ్రలో ఈ సంఖ్యమరింత స్వల్పం.

కనీసం పభుత్వం నేడు నడుపుతున్న పాఠశాలలైనా విద్యార్థులకు అధిక వ్యయం లేకుండా విద్య బోధించునట్లు జూచుటకు ఆయా సంస్థలకు హెచ్చుగ్రాంట్లు నయినా యిచ్చి తోడ్పడుతుందంటే అదీ కన్పించదు. 1949 - 50 సం॥ లో ప్రభుత్వ సెకండరీ స్కూలు విద్యార్థులపై ఎంతెంతఖర్చు జేసిందీ యీ క్రిందయివ్వబడుతున్నది.

| | | |
|---|---|---|
| గవర్నమెంటు పాఠశాలలలోని విద్యార్థిపై | | రు. 119- 7-0 |
| స్థానిక సంస్థలు నడిపే | ,, | రు. 51- 1-0 |
| ప్రయివేటు | ,, | రు. 71-10-0 |

దీని ఫలితంగా ఆయా పాఠశాలలలో చదువుకొనే విద్యార్థులు అధిక జీతాలు చెల్లించుకొనవలసి వస్తున్నది. ఈ పాఠశాలలో చదివే ప్రతి విద్యార్థి 1949-50 లో సగటున యిలా జీతాలపై వెచ్చించటం జరిగింది:—

| | | |
|---|---|---|
| గవర్నమెంటు పాఠశాలలలో చదివే విద్యార్థి | | రు. 22.55 |
| స్థానిక సంస్థలచే నడిపే | ,, | రు. 25.77 |
| ఎయిడెడ్ | ,, | రు. 41.92 |

( వివరాలకు అధ్యాయం చివరి పట్టిక చూడండి )

సెకండరీవిద్య గడించడం చాలా ఆర్థికభారంతో కూడుకొన్న సమస్యగా తయారవటంతో యీ విద్యాలయాలలోకూడ పై తరగతులకు పోయినకొలదీ విద్యార్థులు పల్చబడుతున్నారు. మద్రాసుప్రభుత్వ అంచనాలప్రకారం ఒకటవఫారంలో జేరిన బాలురలో నూటికి షుమారు 50 మంది, బాలికలలో నూటుకి 33 మంది మాత్రమే ఆరవఫారం వరకూ విద్యను కొనసాగిస్తున్నారు; మిగతావారు మధ్యలోనే రాలిపోవటం జరుగుతున్నది.

ఈ పాఠశాలలో ట్రయినింగుపొందిన ఉపాధ్యాయులకొరత తీవ్రముగా ఉన్నది. పనిచేస్తున్న ప్రతి 100 మందిలోనూ 20 మందివరకూ ట్రయినింగుకానివారే.

దీనికి తోడు క్లాసులోని విద్యార్థుల సంఖ్యను 45 మంది వరకూ పెంచ ప్రభుత్వం అంగీకరించుటలో ఉపాధ్యాయుడు క్లాసులోని విద్యార్థులపై వ్యక్తిగతంగా శ్రద్ధజూపే పరిస్థితులులే లేకుండాపొయ్యాయి. దినమెల్లా కృషించే యీ ఉపాధ్యాయులకు పట్టిన వంచరూపాయలు ముట్టటమే కష్టంగా ఉంది. కనుక విద్యార్థుల మొత్తం అభివృద్ధిని ఆలోచించాల్సిన ఉపాధ్యాయులు భుక్తికోసం ట్యూషన్లు వెదకుకొనటం, కాస్త సమర్థులయిన వారు ట్యుటోరియల్ కళాశాలల స్థాపించటం ప్రారంభించారు. ఈ కారణాలవల్ల మన సెకండరీ విద్యాపరిస్థితి దినదినం దిగజారుతున్నది. ఈపరిస్థితులను ఆపుచేయుటకు విద్యావిధానంలోనూ, ఉపాధ్యాయుల జీవన పరిస్థితులలోనూ తీవ్రమైన సంస్కరణలను అమలు జరపటం అత్యావసరం. లేకున్న నేటివలె మన సెకండరీ విద్య నానాటికి తీసికట్టు అవుతుంది.

ఉన్నత విద్య :

మనకున్న మొత్తం ఉన్నత కళాశాలలు (Arts and Science Colleges) 30. వృత్తికళాశాలల సంఖ్య 9.

ఉన్న కళాశాలలో 26 ఆంధ్ర విశ్వవిద్యాలయానికీ, 4 మద్రాసు విశ్వవిద్యాలయానికీ అనుబంధింపబడి ఉన్నాయి. ఇలానే వృత్తి కళాశాలలు 9 దింటిలో 8 ఆంధ్ర విశ్వ విద్యాలయానికీ - ఒకటి మద్రాసు విశ్వ విద్యాలయానికి అనుబంధింపబడి ఉన్నాయి. ఆంధ్ర రాష్ట్రి అవతరణతో కూడ యీ విద్యాలయాలు ఆంధ్ర విశ్వ విద్యాలయానికి అనుబంధింపబడకుండా బలీయమైన శక్తులు అడ్డుబడుతున్నట్లు కన్పిస్తున్నది.

గత రెండు దశాబ్దాలుగా ఆంధ్రులకు ప్రత్యేక విశ్వ-విద్యాలయం ఉన్నా, ఆంధ్రదేశం పారిశ్రామికంగా అభివృద్ధి పొందక పోవుటచేత ఉన్నత విద్య తగినంతగా అభివృద్ధి చెందలేదు. ఇక వృత్తి విద్యల విషయం చెప్పవలసిన పనేలేదు. మనకున్న వృత్తి కళాశాలలల్లా 2 వైద్య కళాశాలలు [ విశాఖపట్నం, గుంటూరు ], 2 ఇంజనీరింగు కళాశాలలు [ అనంతపురం, కాకినాడ ], 1 వ్యవసాయ కళాశాల [ బాపట్ల ], 2 ఉపాధ్యాయుల ట్రయినింగు కళాశాలలు [రాజమండ్రి, గుంటూరు], 1 వ్యాయామ శిక్షణ కళాశాల [ విజయవాడ ], 1 లా కళాశాల [ విశాఖపట్నం ]. వీటిలో గుంటూరులోని వైద్య కళాశాల, అనంతపురంలోని ఇంజనీరింగు కళాశాల స్వయం సంపూర్ణమైన కళాశాలలని చెప్పటానికి వీలులేదు.

మన విశ్వవిద్యాలయం ఎడల ప్రభుత్వ సవతితల్లిప్రేమ మన యీ అధ్వాన్న పరిస్థితులకు చాలవరకు కారణం. ప్రత్యేకరాష్ట్రం సాధించుకొన్న యీ తరుణంలో మనకు వెటర్నిటీ, అటవీశాస్త్రం మున్నగు అనేక ముఖ్యవిషయాలకు ప్రత్యేక కళాశాలలే లేకుండా ఉండటం జరుగుతున్నది. ఉన్న కళాశాలలు, విశ్వవిద్యాలయంకూడ ఆర్థికంగానూ, శాస్త్రపరికరాలను సమకూర్చుకొనటం దృష్ట్యాను చాలా యిబ్బందులకు లోనుగావటం జరుగుతున్నది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు

# ఆంధ్రరాష్ట్రం

## విద్యాలయాలు - విద్యార్థులు

బళ్ళారిజిల్లా సంఖ్యలు మొత్తం యివ్వబడ్డాయి
శ్రీకాకుళం-విశాఖ జిల్లాల మొత్తాలు కలిపి
యివ్వబడ్డాయి.




### సూచిక

ప్రాథమిక పాఠశాల

ప్రాథమిక పాఠశాలా విద్యార్థులు

సెకండరీ పాఠశాల [లక్షలలో

సెకండరీ పాఠశాలా విద్యార్థులు(వేలలో)

కళాశాలలు

కళాశాల విద్యార్థులు (వేలలో)

విశ్వవిద్యాలయం
(మార్కుల క్రింద జిల్లా మొత్తం
సంఖ్యలు యివ్వబడ్డాయి).

మన విశ్వవిద్యాలయం ఎడల చూపిన పక్షపాతవైఖరి యూనివర్సిటీ కమిషన్ రిపోర్టులో యిచ్చిన యీ క్రింది లెక్కలే ఋజువుపరుస్తాయి.

1946 – '49 సం॥ మధ్యలో విశ్వ విద్యాలయ ఆదాయాల్లో ప్రభుత్వ గ్రాంట్ల శాతం.

| విశ్వ విద్యాలయం | విశ్వవిద్యాలయ ఆదాయంలో గవర్నమెంటు గ్రాంటు శాతం | | |
|---|---|---|---|
| | 1946 – '47 | 1947 – '48 | 1948 – '49 |
| అన్నామలై | 47.62 | 58.10 | 44.1 |
| మద్రాసు | 23.4 | 27.1 | 33.7 |
| అలీఘర్ | 35.7 | 52.5 | 52.0 |
| అలహాబాద్ | 52.88 | 72.58 | 26.8 |
| ఢిల్లీ | 52.4 | 66.7 | 71.6 |
| ఆంధ్ర | 20.4 | 37.4 | 16.1 |

ఈ కారణంగా విశ్వవిద్యాలయ విద్య నభ్యసించగోరే విద్యార్థులు విపరీతమైన ఆర్థిక యిబ్బందులకు లోనుగావలసి వచ్చుచున్నారు. దీని పర్యవసానం ఉన్నత విద్య తగినంతగా వృద్ధికాకపోవటం.

గత 3-4 సం॥ లుగా కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాలలో ప్రయివేటుసంస్థల, వ్యక్తుల ప్రోత్సాహంతో కొన్ని కళాశాలలు ఉద్భవించాయి. కాని రాయలసీమ జిల్లాలలోమాత్రం ఒక్క చిత్తూరుజిల్లా మినహా, జిల్లాకొక్క కళాశాలకు మించి లేవు. ఈ కారణంగా అచ్చట ఉన్నతవిద్య మరింత వెనుకబడి ఉండటం జరుగుతున్నది. ఈ తారతమ్యాన్ని నిర్మూలించ నేడు రాయలసీమ జిల్లాల ప్రజలు కోరుతున్నట్లు, అనంతపురంలో ఆంధ్రవిశ్వవిద్యాలయం తన పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులను (Post-graduate Courses) ఏర్పర్చటం; తిరుపతిలో ప్రత్యేకవిశ్వవిద్యాలయాన్ని స్థాపించటం అవసరం.

వృత్తివిద్యా కళాశాలల విషయంలోగూడ నేడున్న లోటును పూడ్చటం అత్యవసరం. ఇందుకు రాయలసీమ జిల్లాలలో ఒక వైద్యకళాశాల, ఒక మైనింగ్ అండ్ మెటలర్జి కళాశాలను నిర్మించటం అవసరం.

ఆంధ్ర దేశంలో నాల్గుమూలలా నేడు దాగి ఉన్న సిరి సంపదలను, ఆంధ్రదేశంగుండా ప్రవహించే జీవనదుల ప్రవాహాల, ప్రజా జీవనస్థాయిని అభివృద్ధి పర్చటకును, ఆంధ్ర ప్రజలలో విజ్ఞాన వికాసాలను పెంపొందించుటకును యీ కనీస చర్యలను ఆంధ్ర ప్రభుత్వం అమలు జరపటం అత్యవసరం.

